



మానవసేవయే మాధవసేవగా నెంచి నిరంతరము శ్రీ సాయి బాబా కరుణా కటాక్షములను, ఆశీస్సులను పీడిత మానవకోటికి అందిస్తున్న తపోధనుడు స్వామి కేశవయ్యాజీ ధ్యానసమాధిలో నున్నప్పటి చిత్రము.






## సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4-50. న.పై. అర్థసంవత్సరపు చందా రు. 2-25. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి 40 న.పై. చందాదారులు ఏ మాసము నుండి యైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

## ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలువుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఆకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికము గాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసము లందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

## చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం ప్రైవేట్ లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను
సంపాదించుటకేర్పడిన
సచిత్ర మాసపత్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౨౬] జూలై 1957 [సంచిక ౭



# విషయసూచిక




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



## కుటుంబాదాయం — స్త్రీలకర్తవ్యం

ప్రధాన జీవితావసరాలతో ప్రతికుటుంబము సౌభాగ్యవంతంగానుండుటకు తగిన ఆదాయ, ఆస్తిపాస్తుల అవకాశాలుండాలి. ఆస్తిపాస్తులు లేనప్పుడు లేదా తమ అవసరాలను సమకూర్చగల ఆస్తిపాస్తులు లేనప్పుడు ఆదాయమైనా జీవితావసరములను తీర్చకలుగాలి. అందుకుగాను ప్రతిసామాన్య కుటుంబంలోను అందరూ తమశక్తి సామర్థ్యములననుసరించి, తెలివి తేటలననుసరించి కుటుంబ ఆదాయం పెరుగుటకు తోడ్పడవలెను. కుటుంబంలో ఏ ఒక్కరో పనిచేసి ఆర్జిస్తూ, అతనిమీద అనేకమంది ఆధారపడుటవలన ఉన్నకాస్త, కూస్త ఆస్తి కరిగిపోయి కుటుంబ ఆర్థికవ్యవస్థ తారుమారైపోగలదు.

కుటుంబ ఆదాయం పెరుగుదలకు స్త్రీలు యితోధికంగా కృషిచేయవలసిన అవసరం ఎంతైనాకలదు. ఉన్నతవిద్యావసతు లమరినవారు ఉద్యోగ సద్యోగాలుచేసి

ఆర్జించవచ్చును. కొద్ది, గొప్ప చదువుకున్నవారు ఉపాధ్యాయినులుగా, నర్సులుగా పనిచేయవచ్చును.

ఇక యిల్లు కదలకుండానే, కుటుంబజీవిగానే స్త్రీలు కుటుంబ ఆదాయాభివృద్ధికి తోడ్పడనవకాశములున్నవి.

కుటుంబజీవితంలో దైనికావసరములను స్త్రీలు అనేకం సమకూర్చగలరు. ముఖ్యంగా దుస్తుల నిర్మాణంలో కుట్టుపనిని స్త్రీలు సున్నితంగా, నాణ్యంగా నిర్వహించగలరు. అలాగే యంత్రబాయిడ్రీ, లేసులల్లడం కూడాను. వీనిమూలంగా కుటుంబాదాయాభివృద్ధికి అవకాశాలను విస్తృతంచేసికొనవచ్చును. పాడిచెయ్యడం యిలాంటిదే- పాలు, పెరుగు, వెన్న, నెయ్యి లాంటివాని అమ్మకం ఏర్పాటులద్వారా కుటుంబ ఆర్థికవ్యవస్థ పదిలంకాగలదు. ఆహారపదార్థములలాంటి ఊరగాయలు, అప్పడాలు, వడియాలు తయారుచేసి అమ్మించవచ్చును. మనయిండ్లలో విస్తళ్లను వాడటం సహజం; వానిని కుట్టి అమ్మకం ఏర్పాటులు చేయవచ్చును. ఒక యింట్లో ఒక్క పురుషుడు సంపాదిస్తుంటే నలుగురు ముగ్గురు ఆడవారు తిని కూర్చొని బాతాకానీలో కాలం గడుపుటకంటె వారు పై మార్గాలద్వారా దినమునకు నాలుగయిదు రూపాయిలు సంపాదించి కుటుంబ ఆర్థికవ్యవస్థకు తోడ్పడినచో ఆ యిల్లు అభ్యుదయ, అభివృద్ధులకు నిలయంకాగలదు.

జాతీయతకు, నీతినియమాలకు విరుద్ధంలేకుండా కుటుంబాదాయాభివృద్ధికి తోడ్పడే ఏపనిని చేయడమైనా, ఒక స్త్రీ నామూషీగా భావించినచో తనభర్త సంపాదించేది చాలక దైనికావసరములు గడువక, అప్పులపాలయి ఆకలిదప్పుల కలమటించడముకంటె మెరుగుకానేరదు.

ముఖ్యంగా కుటుంబాదాయాభివృద్ధికి తోడ్పడటం మధ్యతరగతి కుటుంబ స్త్రీల ప్రధానకర్తవ్యము. కాయకష్టంమీద నాధరపడు కుటుంబాలలోనివారు ఆడ, మగ విచక్షణలేకుండా కృషిచేసి మధ్య తరగతి కుటుంబీకులకంటె మెరుగుగావున్నారు. ఆత్మాభిమానంతోటి, లేని ఆధిక్యత, అతిశయము ఉన్నదనుకునే మధ్యతరగతి కుటుంబాలు బాగుపడాలంటే, నలుగురితోపాటు సౌభాగ్యవంతంగా జీవయాత్ర సాగించాలంటే స్త్రీలు సయితం కుటుంబాదాయాభివృద్ధికి తోడ్పడాలి.

# తిండి గింజలపై కంట్రోల్స

ఆహార ధాన్యాలమీద కంట్రోలు అవసరంగా ప్రభుత్వము భావిస్తున్న సూచనలు కనిపిస్తున్నది. కాని కంట్రోలు ప్రభుత్వ ఉద్దేశాల ననుసరించి, ప్రజల సౌకర్యాల కనువుగా రూపొందడం సంభవమా యనునది పారచూడతగినది. గతంలోని అనుభవాన్ని పురస్కరించుకొని రేషనింగ్, కంట్రోలులాంటి వానిని ప్రజలు కోరి తెచ్చిపెట్టుకోరు. అయితే పెరుగుదల స్థాయిలోనున్న ధాన్యముల ధరలను అదుపులోనుంచుటకు, ఉన్న ధాన్యములను దేశం మొత్తంలో అవసరముల కనుగుణ్యంగా పంపకం జరుగడానికి కేంద్ర మంత్రి శ్రీ కృష్ణమాచారిగారు చెప్పినట్లు ఆహార ధాన్యాల రవాణామీద, నిల్వలమీద, సేకరణమీద ఏదో ఒకరకమైన కంట్రోలు అవసరమనే అనిపిస్తున్నది.

ఆహారధాన్యాల ధరల, పెరుగుదలకు కొరత కారణముకాదని అధికారులు, అనధికారులు అంటున్నమాట. కొరతలేనప్పుడు ధరల పెరుగుదలకు కారణము ఉత్పత్తిదార్ల, వ్యాపారస్తుల పేరాశ చాలవరకు కారణమనవచ్చును.

దేశంలోని ఏ రాష్ట్రానికా రాష్ట్రము తన అవకాశములను, అవసరాలను గుర్తించి, మిగులు రాష్ట్రాలు తమ ప్రజావసరాలు పోను అదనపు ధాన్యపు నిల్వలను తరుగు రాష్ట్రములకు న్యాయమైన ధరలకు సప్లయి చేసినచో ఆహార ధాన్యముల వినియోగ పంపకాలు ప్రజావసరాలకు తోడ్పడగలవు. ఉత్పత్తిదారులు, వ్యాపారస్తులు అవకాశవాదమే పరమార్థంగా నెంచక కొంత పారమార్థిక చింతతో వ్యవహరించినచో ధాన్యముల ధరల పెరుగుదల యీనాటి స్థాయిలో నుండేదికాదు.

ఆహారధాన్యముల క్రమపంపకంకొరకు రవాణామీద, సేకరణమీద, నిల్వల మీద కంట్రోలు విధించనున్నచో. ముఖ్యంగా రాష్ట్రప్రభుత్వాలు చిత్తశుద్ధితో ప్రజావసరాల కనుగుణ్యంగా అమలు జరుపకలుగాలి.

అన్యరాష్ట్రాలకుగాని, అన్యదేశాలకుగాని తమ అవసరాలు తీరనిదే ఆహార ధాన్యాలను ఎగుమతిచేయడం స్వీయక్షేమానికే భంగం. అట్టిదానిని ప్రభుత్వము అరికట్టాలి. సేకరించిన ధాన్యం నిల్వలుండికూడ స్వార్థపరులై, అవకాశంకొరకు ఎదురుచూస్తూ ధరల పెరుగుదల నపేక్షించే ఉత్పత్తిదారులను, వ్యాపారస్తులను ప్రభుత్వము అదుపులో నుంచిననే ధరలు నిలకడగా నుండగలవు.

# బిడ్డలు - తల్లిదండ్రులు

## క్రీడ

శ్రీ కె. వెంకట్రామయ్య



**పిల్లలయాటలందు పెద్దవారి జోక్యమును, సహాయమును అతి స్వల్పము కావలెను** (A minimum of Adult Interference and help)

పిల్లలను సాధ్యమైనంతవరకు స్వేచ్ఛగా నాడుకొననీయవలెను. పెద్దలు మాటిమాటికిని పిల్లల యాటలలో జోక్యము కలిగించుకొన్న యెడల వారి కాలోచ్ఛనసాగదు. అందుచే వారలుకజెంది చిరచిరలాడుటయు, వస్తువులను నాశనముచేయుటయు జరుగవచ్చును. అట్లు గానిచో వారు స్వయముగ నాలోచించుకొనుటనుమాని "అమ్మా, ఇక నేనేమి చేయను? ఏమియాడను?" అని యడుగ నారంభింపగలరు. వారికి తగిన యాటవస్తువులును, ఉపకరణములును ఉన్న యెడల ఇతరుల సహాయములేకయే యెంతో బాగుగా నాడుకొనగలరు. కాని సామాన్యముగ వారి కనుభవము తక్కువగుటచే తామిక యెట్లాడవలెనో తోచక తరచుగా బాధపడుచుందురు. ఇది మనము గ్రహించి వారు మన సహాయము నడుగవచ్చినప్పుడు విసుగుజెందక వారాటను తిరిగి సలుపుటకు సరిపడు నాలోచన నీయవలెను. లేదా మరియొక క్రొత్తయాట నారంభింపజేసి వారిని స్వేచ్ఛగా నాడనీయవలెను. అదియొక వర్షపుదినమగుటచే బిడ్డలింటనే యుండవలసివచ్చెనుకొందము. అప్పుడు మనము బిడ్డలాడుకొనుటకై అంగడి యాటనో, సంగీత వినోదమునో, సినీమా యాటనో సూచింపవచ్చును. ఆ యాటల నెట్లాడవలెనో, వాని నాడుట కేవి యవసరమో యను విషయములనుగూర్చి వారితోనే యాలోచించి పిదప వారినే యాడుకొననీయవలెను. బిడ్డలు తమ యాటలలో మనలనుగూడ పాల్గొనుడని కోరినచో పాల్గొనవచ్చును. వారి యాటలలో పాల్గొనునప్పుడు వారి ననుసరించుచు వారితో సరిసమానముగ నాడుటకే ప్రయత్నింపవలెను. మన పెద్దరికమును చూపబోరాదు. ఆటలందు మనము చేయు సూచనలు, సూచనలే కావలెను. ఆజ్ఞలు కారాదు. వారి యాటయందు మనము పాల్గొనినను ఆ యాట తమదే యనుభావము వారికిపోరాదు. వారి "అనుభవలేమిని" (lack of experience), "ఆలోచన తక్కువ"ను (mental immeturity) జ్ఞప్తికి దెచ్చుచుండరాదు. పిల్లలలో పిల్లలమై మన పెద్దతనమును మరచి యాడగలిగినగాని పిల్లలు మనతో నాడుట కిష్టపడరు.

**క్రీడకు సాధారణముగా కావలసిన విషయములు** (play requirements.)

బిడ్డలు తమ యాటమూలమున నెక్కువ మేలును పొందుటకు ప్రధానములగు విషయములు కొన్ని కలవు. అవి లోపించినచో వారి యాట ఏదో విధముగ నసంతృప్తికరమగును. ఆటకు కావలసిన వేవనగా:—

### 1. ఆటస్థలము:—

బయటి యాటకు తోట యెంతయు తగియుండును. అందుకొంత స్థలము పూలమడులులేక స్వేచ్ఛగా నాడుకొనుటకు వీలుగ నుండవలెను. ఆటబండ్లను (Dinkies) నడుపుటకు తగిన దారులుండవలెను. నీడ నిచ్చు పెద్ద చెట్టును, గాలివీచని ఒక మూలయు తోటలో నుండుట మంచిది.

బిడ్డ ఇంటియందాడుటకు ప్రత్యేక స్థలముండ

వలెను. అది బిడ్డ తన యాటవస్తువులను దాచుకొనుటకును, పెద్దల కడ్డముపోకుండ స్వేచ్ఛగా నాడుకొనుటకు వీలుగాను, ఉండవలెను. ఇంటియందొక గదియో, షెడ్డో, వరాండా చివరిభాగమో, బిడ్డ యాటకు ప్రత్యేకముగా నేర్పాటుచేయుట మంచిది. ఆ స్థలము తనదే యగుటచే దానిని సరిగా జూచుకొనెడి బాధ్యత బిడ్డకు మొదటినుండియు నేర్పవలెను. తనకొక ప్రత్యేకస్థల ముండుటచే ఇంటియందన్ని చోట్లను ఆడగూడదనియు, దానివలన ఇతరుల కిబ్బంది కలుగుననియు బిడ్డ గ్రహింపగలడు. అందుచే నతడితరుల హక్కులను గౌరవించుట నేర్చుకొనగలడు.

## 2. ఆటకు కావలసిన ఉపకరణములు.
## (Play Equipment.)

లోనియాటకు:-బిడ్డలకు తగిన చిన్న చిన్న కుర్చీలు, టేబిల్లు ఉండవలెను. అవి బొమ్మలను గీయుట, బొమ్మలను తయారుచేయుట మొదలగు పనులను చేసికొనునప్పుడుపయోగించుటకు వీలుగా నుండవలెను. బిడ్డలు తమ యాటవస్తువులను భద్రపరచుకొనుటకు తగిన బీరువాలును, పుస్తకముల నుంచుకొనుటకు తగిన షెల్ఫులును, ఉండవలెను. అవి క్రిందుగానుండి వారి కందుబాటులో నుండవలెను.

బయటియాటకు:-ఆటవస్తువులను, ఆట సామాగ్రులను భద్రపరచుకొనుటకై ఒక చిన్న షెడ్డుగాని పెద్ద ప్యాకేజీ పెట్టెగాని ఉండవలెను.

## 3. తగిన యాటవస్తువులు తదితర సామాగ్రులు:—

బిడ్డల యాటయందుగల విలువను, వివిధత్వమును (Variety) గూర్చి పూర్తిగా వ్రాయుట కెన్నో అధ్యాయములుపట్టును. క్లుప్తముగా జెప్పుట చాల కష్టము. బిడ్డల క్రీడావసరములలో (Playneeds) (అందును చిన్న బిడ్డల యవసరములలో) ప్రధానములైన వేవో చాలమంది పెద్దవారికి తెలియదు. ఇది యెంతయు శోచనీయము. బిడ్డల యాటవస్తువులకని పెద్దలు ప్రతి సంవత్సరము నెంతో సొమ్మును వృధా చేయుచుందురు. వారేవో విచిత్రములగు క్రొత్త యాట వస్తువులను దెచ్చి బిడ్డల కిచ్చుటయు, వానిని బిడ్డలు పగులగొట్టి పాడుచేయుటయు తరచుగా జరుగుచునే యుండును. పెద్దలు కొన్న యాటవస్తువులు పెద్దల కాకర్షణీయములు కావచ్చును. కాని అవి పిల్లల కాకర్షణీయములు కాజాలకపోవచ్చును. కనుకనే వారు తరచుగ పెద్దలు దెచ్చిన యాటవస్తువులతో నాడక ఏ పురాతనపు ఆటవస్తువులతోనో ఆడుకొని సంతృప్తినొందుచుందురు.

నడివయస్సురాని బిడ్డల కవసరమగు ఆట సామగ్రుల జాబితా దిగువనీయబడెను. అందుదహరించిన వానిలో కొన్నిటిని బజారులలో కొనవచ్చును. కొన్నిటి నింటనే తయారుచేసికొనవచ్చును. తక్కిన వానిని చిన్న పిల్లల యాటవస్తువులను ప్రత్యేకముగా నమ్మెడి షాపులలో కొనవచ్చును. కొన్ని యాట వస్తువుల పేర్లు, అవి యేవో తెలియనివారికి అర్థము కానివిగా నుండును. అవి షాపులలో నడిగిన దొరకగలవు.

(సశేషము)



# వ్యాపార కార్మిక రంగాలలో

## అమెరికా స్త్రీల పాత్ర



అమెరికాలో కాయిదా వ్యాపారం - పెట్టుబడి బ్యాంకింగు సంస్థలలో అతిపురాతనమైన ఎ. ఎం. కిడ్డర్ అండ్ కంపెనీ బోర్డు ఛైర్మన్‌గా మిసెస్ చార్లెస్ ఉర్లిక్‌బే ఎన్నికైనప్పుడు దేశానికి ఆర్థిక లావాదేవీల కేంద్రమనదగు వాల్‌స్ట్రీట్‌లో అదేదో కొత్తగా కనపడింది. 165 సంవత్సరాలుగా జరుగుతున్న న్యూయార్కు స్టాక్ ఎక్స్ఛేంజీ వ్యాపారంలో పురాతనమైన సంస్థ ఒకదానికి అధిపతిగా ఒక మహిళ ఎన్నిక కావటం ఇదే మొదలు. అందుకే అదేదో కొత్తగా తోచింది.

నల్లని తల నీలాలు మెరుస్తూ ఉండే ఈ మహిళ తనకు ఈ వ్యాపార పరిజ్ఞానం కలగటానికి కీర్తిశేషుడైన తన భర్త నేర్పటమే కారణం అయింది. 1955 లో మరణించే నాటికి ఆమె భర్త ఈ కిడ్డర్ కంపెనీ ప్రధానభాగస్వామిగానూ సీనియర్ అధ్యక్షుడుగానూ ఉండేవాడు. "ఆయనకు నేను బలమైన పోర్టుగానూ, ముఖ్య సలహాదారుగానూ, వ్యాపారంలో భాగస్వామిగానూ ఉండేదాన్ని అని మిసెస్ చెబుతుంది. ఆమె ఒక పెద్ద షిప్పింగ్ లైన్ బోర్డు డైరెక్టరుగానూ, ఛైర్మనుగానూ కూడా పని చేసిన అనుభవజ్ఞురాలు. ఆమె, తన భర్త కలిసి ఏర్పాటు చేసిన ఒక ధర్మ సంస్థకి కూడా ఆమె అధ్యక్షురాలు.

వాల్ స్ట్రీట్‌లో ఆమె ప్రముఖ మహిళ. స్టాక్. ఎక్స్ఛేంజి మార్కెట్ నిర్వహణలో నానాటికి స్త్రీల సంఖ్య పెరుగుతున్నది. అమెరికాలో స్వేచ్ఛా వ్యాపార వ్యవస్థకు పెట్టుబడి ప్రధానంగా లభించేది ఈ స్టాక్ మార్కెట్ నుంచే.

ఇక్కడగల దాదాపు 300 ఎక్స్ఛేంజి సంస్థలలో గల ఉద్యోగులలో 1200 మంది మహిళలు ఉన్నారు. స్త్రీలు ఎక్కువగా దిక్కర్ డివిజన్‌లో అసిస్టెంట్ మొదలు మేనేజరువరకు గల ఉద్యోగాలలో కనబడతారు. దిక్కర్ డివిజన్ అంటే ప్రత్యేక టెలిగ్రాఫ్ సర్వీసు ద్వారా దేశమంతటా గల స్టాల్ బ్రోకర్లకు స్టాక్ వ్యాపార వివరాలు తెలుపుతుండే శాఖ.

ఈదిక్కర్ రిపోర్టులకు ఆధారమైన టెలిఫోనుకోటేషన్ (టెలిఫోన్‌ల ద్వారా వాటాల ధరలు తెలపటం) శాఖనుకూడా స్త్రీలే అజమాయిషీ చేస్తారు. 70 మంది "ధరలు తెలిపే గుమాస్తాలు" (కోట్ క్లర్కులు) ఓవర్‌హెడ్ బోర్డులు గమనిస్తూ నిరవధికంగా అడిగేవారికి ధరలు తెలుపుతుంటారు. ఈ ఓవర్‌హెడ్ బోర్డులు గమనిస్తూ నిరవధికంగా అడిగేవారికి ధరలు తెలుపుతుంటారు. ఈ ఓవర్‌హెడ్ బోర్డులు ధరలను ఎప్పటికప్పుడు తాజాగా చూపుతుంటవి.

ఇంకా లైబ్రరీ పెత్తందార్లుగాను, ప్లేస్‌మెంట్ సెక్రటరీలుగాను, గ్యాలరీ గైడ్ల అధిపతులుగాను కూడా స్త్రీలు స్టాక్ ఎక్స్ఛేంజీలలో పనిచేస్తారు. ఈ గైడ్లు ఎనిమిదేసి మంది ఒక జట్టుగా ఉండి ఏటా దాదాపు 175000 మంది కాతాదార్లకు వారు వచ్చినప్పుడు మర్యాదలు చేసి స్టాక్ పరిస్థితులు వివరిస్తారు. తద్వారా రోజూ వేలాది వాటాలు అమ్మకం కొనుగోళ్లు జరుగుతుంటవి.

ఎక్స్ఛేంజి సంస్థల వెలుపల స్టాక్ బ్రోకర్లుగా 350 మంది స్త్రీలు, రిజస్టర్డు ప్రతినిధులు (రిప్రజంటేటివ్స్)గా 859 మంది పని చేస్తుంటారు.

ఇక బ్రోకర్ వ్యాపార సంస్థలుకూడా స్త్రీలను చేర్చుకుంటవి. ఆర్డర్లు తీసుకొనే ముందు స్టాక్ మీద కొటేషన్లు పరిశీలించటం వంటి ముఖ్య పనులకు వీరిని నియమిస్తారు. అమలు జరుపవలసిన ఆర్డర్లను క్రమంలో పెట్టటం ముందు జరిగిన లావాదేవీల రికార్డులు పరిశీలించటం వీరిపని.

ఆర్థిక విషయాల పరిశోధన, పరిశీలన రంగంలో

కూడా స్త్రీల ప్రాముఖ్యం పెరుగుతున్నది. ఒక కంపెనీ లేదా పరిశ్రమ యొక్క విలువను అంచనా వేసి దాని పెట్టుబడులకుగల అవకాశాలను విలువకట్టే నిపుణులు వీరు. "ఈ సమాచారంలో ఎక్కువ భాగం కంపెనీ నిర్వాహకులనుంచి తెలియ వలసి ఉన్నది. దీనిని రాబట్టటం చాల గడ్డుపని. ఈ విషయంలో మగవారికంటే స్త్రీలే జయప్రదంగా సమాచారం రాబట్టగలరని బ్రోకర్లు అంటారు" అని! వాల్ స్ట్రీట్ జర్నల్! పత్రిక అంటుంది.

వాల్ స్ట్రీట్ వ్యవహార నిర్వహణలో స్త్రీల పాత్ర పెరగటంతో పాటు బ్రోకరేజి సంస్థలకు వచ్చే ఖాతాదారులలో సైతం మహిళల సంఖ్య పెరుగు తున్నది. స్టాక్ ఎక్స్చేంజివారు వాటాదార్ల విషయంలో జరిపిన పరిశీలనను బట్టి ఈ విషయం తేలింది.

అమెరికా "ప్రజల పెట్టుబడిదార్రీ విధానం"లో 4,445,000 మంది దాకా స్త్రీ వాటాదార్లు ఉన్నట్లు దీనివల్ల తెలిసింది. 1952 నాటి కంటే వారి సంఖ్యలో 40 శాతం పెరిగింది. గత సంవత్సరం స్టాక్ హోల్డర్లు (వాటాదార్లు)గా ఉన్నవారి సంఖ్యలో పురుషులకంటే స్త్రీల సంఖ్య ఎక్కువయింది. స్త్రీలు 52 శాతంలో ఉన్నారు. అయితే ఎక్కువ వాటాలు మగవారిచేతుల్లోనే ఉన్నవి.

## కార్మిక రంగం :

కార్మికుల సంఖ్య వచ్చే 10 సంవత్సరాలలోనూ మరి 10 మిలియన్లు పెరగవచ్చునని భావించబడు తున్నది. ఇందులో దాదాపు సగంభాగం స్త్రీలు ఉండవచ్చును.

ఇలా జరిగినప్పుడు అమెరికాలో ఒక కొత్త పరిస్థితి ఏర్పడుతుంది. ఈ పరిస్థితి దేశంలోని ఆర్థిక శాస్త్రవేత్తల, సాంఘిక శాస్త్రజ్ఞుల దృష్టినేగాక వ్యాపారస్తుల, ప్రభుత్వ అధికారుల దృష్టిని సైతం ఆకర్షించనున్నది. ఈ క్రింది ప్రశ్నల సమాధానాలు ఇందు ఇమిడి ఉన్నవి.

అమెరికా కార్మిక బలగంలో ఖచ్చితంగా ఈ నాడు స్త్రీలపాత్ర ఏమిటి? ఈ మార్పుకు కారణా లేమిటి? ఈ మార్పు భవిష్యత్తును గురించి ఏమి సూచిస్తున్నది?

కొలంబియా విశ్వవిద్యాలయంలో ప్రధాన కార్యస్థానంలో ఏర్పాటయి పనిచేస్తున్న నేషనల్ మేన్ పవర్ కౌన్సిల్ అని అనధికార నిష్పాక్షిక పరిశోధక బృందంవారు ఈ ప్రశ్నలకు కొన్ని సమాధానాలను కనిపెట్టడానికి ప్రయత్నించారు. ఈ సంఘం ఇటీవల ప్రెసిడెంట్ ఐసెన్‌హోవర్‌కు 400 పేజీలుగల ఒక నివేదికను సమర్పించింది. కార్మిక బలగంలో స్త్రీలు అనే విషయంపై వారు రెండు సంవత్సరాలుగా జరిపిన పరిశీలన వివరాలు ఇందుగలవు.

వీరి పరిశీలనలో అనేక ఆసక్తి జనకమైన సమంజసమైన విషయాలను బయటపెట్టటం జరిగింది. ఉదాహరణకు వారు ఒక విషయం గమనించారు. ఏ సెల తీసుకున్నప్పటికీ 14 సంవత్సరాలు అంతకుపైన వయస్సుగల స్త్రీలలో మూడోవంతుమంది అమెరికా కార్మికబలగంలో ఉన్నారు. అంటే 21 మిలియన్ల మంది స్త్రీలు ఉన్నారు.

అమెరికాలో కార్మికులంతా పనిచేసిన పని గంటలలో నాలుగోవంతు గంటలు స్త్రీలు పనిచేశారు. కార్మికులు పుచ్చుకొన్న వేతనాలు, కూలీ మొత్తంలో అయిదోవంతు స్త్రీలకు ముట్టింది. అంటే 42,000 మిలియన్ల డాలర్లకు పైగా వారికి ముట్టిందన్నమాట.

ఇప్పుడు పనిజేస్తున్న వారందరిలో నూరింట 60 వంతులమంది స్త్రీలు వివాహితలు. మొత్తంలో సగానికిపైగా 40 ఏళ్ల వయసు దాటినవారు. వివాహమయిన ప్రతి పదిమంది మహిళలలోనూ ముగ్గురు పనులలో ఉన్నారు. మధ్యకారు ఆపై వయస్సుగల స్త్రీలు 1950 తరువాత మిగతా మరే విడిజట్టుకంటే కూడా అదనంగా పనుల్లో చేరారు.

ఈ నాడు వారికి తగిన ప్రతి పనిలోనూ స్త్రీలు కనపడతారు. అయితే ఇప్పటికీ మూడోవంతుమంది

ప్రభుత్వ కార్యాలయాలలోనూ, గుమాస్తా ఉద్యోగాలలోనూ, అమ్మకందారులుగాను పనిచేస్తున్నారు.

ఈ ధోరణి ఇలా ఉండటానికిగల కారణాలను అన్వేషించబూనటంలో సాంఘిక పరిణామాలలో ఏయే వయసులలో ఏయే ముఖ్యసంఘటనలు జరుగుతవనే విషయాన్ని పరిశీలించటం జరుగుతుంది. 1890 నాటితో పోల్చినట్టయితే ఈ నాడు ఆడపిల్లలు పాఠశాలలనుంచి ఆలస్యంగా మానివేస్తున్నారు. అప్పటికంటే త్వరగా పెళ్ళిచేసుకొని పిల్లల్ని కంటున్నారు. ఎక్కువకాలం జీవించగలుగుతున్నారు.

స్త్రీలు సగటున తమ భర్తలకంటే 18 సంవత్సరాలు అదనంగా జీవిస్తున్నారు. అందుచేత జీవితంలో చివరభాగంలో వైధవ్యం పొందుతున్నారు.

ఈ మార్పులవల్ల ఈ నాటి స్త్రీలు తమ జీవితకాలంలో అధికతరమైన ఆర్థికభద్రత, ఉపయోగకరమైన విధంగా వినియోగించటానికి ఎక్కువ స్వేచ్ఛాకాలాన్ని కలిగిఉంటున్నారన్న అంశం తేలుతున్నది. ఆశ్చర్యకరంగా జరుగుతున్న అమెరికా ఆర్థికవిధాన అభివృద్ధిని దీనికి కలపవలసి ఉన్నది. ఈ ఆర్థికవిధానంవల్ల గత పది సంవత్సరాల కాలంలోనూ లభిస్తున్న వారికంటె హెచ్చు మందికి ఉద్యోగావకాశాలు ఏర్పడినవి.

ఆ కౌన్సిల్ వారు గమనించిన అంశాలనుబట్టి వీటన్నిటి ఫలితంగా ఈ నాడు పాఠశాలలో చదువుతున్న సాధారణ బాలిక తన జీవితకాలంలో ఏదో సమయంలో పాతిక సంవత్సరాలపాటు తన ఇంటికి వెలుపల లాభసాటి ఉద్యోగంచేసే అవకాశం కలిగి ఉంటుందన్నమాట.

అమెరికా కార్మికశాఖవారు మనుష్యశక్తి గురించి జరిపిన పరిశీలనలు ఈ అంశాన్ని మరికొంత వివరిస్తున్నది. 1965 నాటికి ఆడపనివారి సంఖ్యలో రానున్న 5. 4 మిలియన్ల పెరుగుదల ముఖ్యంగా లేత వయస్సు బాలికలు, ముదురు వయసు ముసలమ్మల విషయంలోనే ఉండగలదని వారు అంచనా వేస్తున్నారు.

ఇక 25 - 34 మధ్య ఏళ్లప్రాయంగల మహిళల విషయంలో పెరుగుదల ఉండకపోవచ్చును. వీరిలో ఎక్కువమంది పిల్లల పెంపకం, సంసారాలు చక్కబెట్టుకోవటంలో నిమగ్నమై ఉంటారు. 14-24 మధ్య వయస్సుగల వారి సంఖ్యలో 1. 8 మిలియన్ల పెరుగుదల 35-44 మధ్య వయస్సుగల వారి సంఖ్యలో ఒక మిలియను పెరుగుదల ఉండవచ్చునట. అన్నిటికంటే 45 లపైన వయస్సుగల స్త్రీల సంఖ్యలో హెచ్చయిన పెరుగుదల ఉంటుందని భావించబడుతున్నది. వీరి సంఖ్యలో 2. 6 మిలియన్ల పెరుగుదల ఉండవచ్చునట.

ఈ కౌన్సిల్ వారి పరిశీలననుబట్టి జీవితకాలమంతా ఉద్యోగులలోనే గడపగోరే మహిళల సంఖ్య అమెరికాలో లేకుండా అంతరించిపోవచ్చునన్న అంశం తేలుతున్నది. స్త్రీలకు ప్రధానంగా తమ భర్తలు, పిల్లలు, సంసారమూ వీటి పట్లనే మక్కువనే ఎక్కువగా ఉంటుందని ఈ అమెరికన్ కౌన్సిల్ పేర్కొన్నది.

U.S.I.S



# అంధ భిక్షుకి

---

మూలం :
శ్రీ శీలామిశ్రా

అనుసరణ :
శ్రీ యాబలూతి రామారావు
శ్రీ కోనా. యన్. మురళి
శ్రీ కె. హెచ్. హనుమంతరావు

నేత్రాలువున్న వాళ్ళందరూ నన్నుచూచి నవ్వుతారు. కొంతమంది పెద్దగా వికృతంగా నవ్వేవారు. మనుష్యులందరికీ నన్ను గురించి చెప్పుకోటానికి చక్కని వింతైన మంచికథలుండేవి. వాళ్లు చెప్పుకునేవన్ని నాకు తెలుసు కాని గాడిదల మాదిరిగా నవ్వటం అర్థం కాలే. వాళ్లు నవ్వటం నాకు చక్కని హృదయమున్నదని, పైగా ఆమెను వివాహమాడానని, నేను ప్రేమికుణ్ణి, భర్తనూ ఎట్లా అయానో అది ఒక గాథ. వాళ్లు ఆశ్చర్యంగా భావించినదే వాళ్లను నవ్విస్తున్నది. మీరు అర్థంచేసుకోవాలనుకుంటె నన్ను చూడమంటారు. నాలో ఏదైనా వింత విశేష ముందేమో చూడండి. నేనూ ఒక మనుష్యుడనే.

నేను అంగసౌష్టవములేని పొట్టి మనిషిని. బొగ్గును పోలి నల్లగా, దేహానికి మించిన పెద్దతల. ఆ తలలో చప్పి ముక్కు, యిరువైపులా రెండు రక్తవర్ణపు మిడిగుడ్లు. దానిక్రింద కప్పనోరువంటినోరు ఏనుగు చెవులవలె, విశాలమైన చెవులమధ్య పాలభాగము, వీటికి తోడుగా చిన్నప్పుడు పడి విరగగొట్టుకొనిన కాలు, తలకాయకు వికారమైన కిరీటము. పంద్రెండవ ఏటనే పోసిన స్ఫోటకపు మచ్చలు యివన్ని చూస్తుంటే వికారానికి పెద్ద పర్వతమనిపిస్తుంది. నన్ను మొదట చూడంగానే నల్లని కోతినసేభావాన్ని ఏర్పరుచుకొన్నట్లు నాతో అంటారు. రోడ్డుమీద నడిచేటప్పుడు యితరులతో నన్ను గురించి చెప్పటం విన్నా "ఈ మనిషిని చూస్తుంటే, హంచ్ బాక్ ఆఫ్ నాటర్‌డామ్ (Hunchback of Notterdam) జ్ఞాపకానికి వస్తాడు" గూని లేనప్పటికీ వాళ్ళతో విరుద్ధాభిప్రాయము లేదు. వాళ్ళ నవ్వు, నేను ఎట్లా వున్నది బాగా గుర్తుకు తెస్తుంది.

మంచి అందమైన బట్టలు వేసుకొని తిరిగే స్త్రీలను చూసి నాలో నేను క్రుంగిపోతా. వాళ్ళు మొహాలు త్రిప్పేసుకుంటారు. వాళ్లు గర్వంగా భావించి మానవుణ్ణిగా (సున్నితమైన ఊహలతో) ఎప్పుడైతే నన్ను గౌరవించలేదో అప్పుడే నే గ్రహించుకున్నా! మీ రందరూ చక్కదనాన్ని ఆనందించినట్లు నేను ఆనందిస్తా. వాళ్ళు నేను చక్కదనాన్ని ఆనందించటం క్షమించరాని తప్పుగా భావిస్తారు. అచ్చట ఈ విశాలమైన ప్రపంచములో నా బోటివాళ్లు నివసించటానికి తావులేదని నాకు బాగా తెలుసు.

నేను పుట్టీ పుట్టకమునుపే నా తండ్రి చనిపోయినాడు. మిగిలిందల్లా ఒక ముసలితల్లి మాత్రమే! నా రూపానికి కారకులెవరు? తండ్రియా, తల్లియా! వారిని ఎట్లా నిందించేది. అసలు ఎందుకు నిందించాలనికనుక! బహుశ నేను పుట్టాలని వాళ్ళ కోరికేమో! మా వంశము అభివృద్ధికి పూవులు పూయవద్దూ, అవి కాయలుగా మారవద్దూ!

మా అమ్మ నాతో అన్నది "నీవు ఒక యింటివాడవు కావాలిరా" ఆ ప్రశ్న నాకేమి ఆశ్చర్యం కలిగించలేదు కాని బరువైన హృదయాన్ని చేరదీసుకుంటూ "అట్లాగేనమ్మా" అని అన్నా! ఆమె అందరితో సంప్రదింపులు జరిపినది. ఇంకా జరుపుతునే యున్నది. కాని ఆమె ముఖములో విషాదఛాయలు అలుముకున్నయి. ప్రతిరోజూ పాలిపోయిన మొఖంతో యింటికి వస్తూండేది. అలా విచారంగావున్నావేమమ్మా అని అడిగేవాడిని. "ఆమె ఏమిలేదని" అనేది. ఆమె ఏమిలేదని అనే దాంట్లోనే నిస్సహాయత్వము కనపడేది. తలనెరిసిన ముసలాయన అనేవాడు

"పాపము! వాళ్ళ అమ్మ చాల కష్టపడ్డది కొడలిని తీసుకురావాలని ఓ భగవంతుడా యిటువంటివాళ్ళను ఎందుకు పుట్టిస్తావు!"

అందంగా వుండాలని నిశ్చయించుకున్నా. విలాస సామాగ్రిని వాడేవాడిని. మల్లెపూలవంటి తెల్లని గుడ్డలతో తిరగడం మొదలుపెట్టా. అప్పటినుంచి ప్రజలు విపరీతంగా నవ్వటం మొదలు పెట్టారు. వీటి వల్ల మరీ వికారంగా మారానా అని అనిపించేది. కాని గ్రహించుకున్నా "కాకి పాల సముద్రంలో మునిగినా హంస కాజాలదని" అప్పటినుంచి మామూలు మనిషిని అయినా.

అఖరికి నా జీవితములో ఒక ప్రేయసి దొరికింది. నా ప్రేమకథ వింటానికిఓర్పు లేకుండా పోతుందేమో! నేను ప్రేమను వాంఛించేవాణ్ణి. అది సహజమేకదా! నా ప్రేమగాథ నిజంగా చాలా విచిత్రమైనదని మీరే అంటారు. ఓ నవయవ్వనాంగి నన్ను ప్రేమించి పెళ్ళిచేసుకొన్నది. ప్రతివారు అసహ్యించుకొని దగ్గరికి చేరనీయని నా వికృతరూపం మా పెండ్లికి ఏమాత్రం అడ్డురాలే!

కోడలిని తీసుకొని వచ్చే ప్రయత్నంలో మా అమ్మ ఓడిపోయింది. ఏ స్త్రీ ఈ నరవానరుణ్ణి పెండ్లి చేసుకోదని విచారించింది. ఈ విచారాన్నికూడా కలుపుకొని జీవితంలో ఎవ్వరూ తప్పకోలేని ముసలితనం లోనికి ప్రవేశించినది. నా మండుతున్న హృదయాన్ని ఆమె చల్లని ప్రేమగాలులతో చల్లార్చివేసేది. నా ఈ భయంకరమైన వికారంలో ఆమె ఏమి అందము చూడగలిగేదో! ఆమె కోడలు గాలేదని మనసు కష్టపెట్టుకొని, మూలుగుతూ, ముసలితనంలో నన్ను వదిలివేసి శాశ్వతంగా కళ్ళు మూసింది. ఆమె మరణానికి ఏమాత్రము దుఃఖించను, ఎందుకంటే బాధపడటానికి ఆమెవద్ద ఏమాత్రము బలములేదు కాబట్టి!

ఆ తర్వాత యిట్లా అయింది - వాకిట్లో మెట్ల దగ్గర తలుపుచప్పుడు వినిపించింది. "కబోదిని కొంచెం దానంచెయ్యండి స్వామీ" అని అరచింది. ఆమె ఒక ముష్టిది. తను చూడలేనని చెప్పింది. ఆమెను చూచా. అది చాలా జాలికరమైన పరిస్థితి. నన్ను నేమరచి యిట్లు అనుకున్నా "బీద అమ్మాయి పాపం! కళ్లు లేవు. ఆమె జీవితంలో వినటానికి, తాకటానికితప్ప చూడటానికి నోచుకోలేదుకదా" అని.

ఆమె చూడటానికి అందమైనది కాకపోవచ్చు. కాని ఆమె సౌష్ఠవమైన అవయవాలు ఆమె నవయవ్వనాన్ని యినుమడింపచేస్తున్నవి. నా హృదయం కృష్ణాప్రవాహంలా ఆమె దగ్గరకు పరిగెత్తింది. మర్యాదగా ఆమెను లోపలికివచ్చి కూర్చోమన్నా! తలుపుకోసం తడబడింది. నేను లేచి ఆమెను తీసుకు రావటానికి వెళ్ళా. బరువైన హృదయంతో అణచివేసిన కోరికలతో అదే మొదటిసారి అమ్మాయిని ముట్టుకోవటం. మళ్ళీ ఒక తడవ ఆమె మొఖంలోకి రేడియం చూపులతో చూశా. ఏమిటి ఈ బాలిక అందం? అసలయిన అలమండ మామిడితాండ్ర! వేయిసిసలైన పచ్చకర్పూరపు డబ్బాలు గుమ్మరించినట్లు. ఇంకేముంది తన హృదయం ఆగిపోయింది. ఆగిపోవడమేమిటి! వుండవలసిన స్థలంలో లేదు. ఆమె విశాలమైన వక్షోజాలు నాకు దగ్గరగా వచ్చాయి. కాళ్ళు తడబడ్డాయి, నరాలు వుబికాయి. ఒళ్ళు వేడెక్కింది. శ్వాస తొందరగా పీల్చుతున్నా. అతిప్రయాసమీద ఆమెను అక్కడ ఓ కుర్చీమీద కూర్చోబెట్టా! నా చేతులు వణకటం ఆమె గ్రహించిందేమో! నేను వండుకున్న దాంట్లో నే కొద్దిగాపెట్టి, ఒక రూపాయి యిచ్చా. ఆమె పేరు లీల అని. ఆమె, ఆమె ముసలితల్లితో ఒక గుడిసెలో ఊరి చివర వుంటున్నట్టు చెప్పింది. ఆమె వెళ్ళేటప్పుడు మళ్ళీవస్తూపోతూ వుండమన్నాను.

లీల మా యింటికి తరచూరావటం మొదలు పెట్టింది. ఆమె నేను చాల విషయాలు మాట్లాడుకునేవాళ్ళం. నా జీవితంలో విసుగుదల, హృదయంలో బాధ తగ్గినవని అనుకున్నా. జీవించాలి అనే కోర్కె నాలో బలంగా నాటుకుపోయింది. దానికి కారణం

ఆమెకు కళ్ళులేకపోవటమే అని అనిపిస్తుంది. లీలకు కళ్ళువుంటే ఆమె అందాన్ని చక్కదనాన్ని బాగా చూపించేవి. స్త్రీ సౌందర్యము మనుషుల పురోగమనానికి నిజమైన ఉత్తేజం కలుగజేస్తుందని, మనుష్యుని చేత స్త్రీ సౌందర్యం ఎంతటి ఉత్తమకార్యమయినా చేయిస్తుందని, స్త్రీ సౌందర్యం మనుషుని హీనమైన పశువునిగా తయారుగా చేస్తుందని బాగా తెలుసుకున్నా నా ఆకలితో నిండిన హృదయానికికూడా కోరికలు! ఎంత తెలివితక్కువపనో, ఆమెకే కనుక కళ్ళువుంటే ముష్టిఎత్తుకొనేది కాదేమో! నా దగ్గరనుంచి బిచ్చముతప్ప వేరే ఏమీ తీసుకునేదికాదు. ఆమె కళ్ళు ప్రతిరోజూ ఆమెని యిటువైపు రానిచ్చేవికావు. దగ్గరకు రానిచ్చేవికావు. మాట్లాడనిచ్చేవికావు.

మేము ఆనందంగా గడిపిన క్షణాలు ప్రజల కంటబడ్డాయి. అయితే ఎవ్వరూ మమ్మల్ని అడ్డుపెట్టలేదు. యిదివరకు నేను నరవానరుణ్ణి అని ఎగతాళి చేసేవారు. యిప్పుడు నా ప్రేమగాథ గుడ్డిదానితో నని తెలిసి వారిని కవ్వించి, నవ్విస్తున్నది. నాకు రూపానికి గ్రుడ్డిది దొరికిందని సంతోషించేవాళ్లు. ఒకరోజున లీలను అడిగా "లీలా నీవు నన్ను గురించి ఏమనుకుంటున్నావ్" అని. ఆమె సిగ్గుతో నవ్వే చిరునవ్వు నాకు ఎక్కువగా సంతోషంకలిగించేది. మాట్లాడమని బలవంతపెట్టా. "నేను మిమ్మల్ని చెడ్డవారని అన్నానా" అని ఆమె మృదువుగాపల్కింది. ఆమె జవాబు బాగుందని సంతోషించి ఆమెతో నేను అనకపోయినప్పటికి ఏదో అడిగేశా "నేను బాగున్నానా" అని ఆమె తలకాయ వంచుకొన్నది కాని ఏమి అనలా. అప్పుడే జీవితం ఒక బొమ్మలాటగా కాక జీవితం మొక తోటగా చూచుకొన్నాను. లీల వెంటనే వెళ్ళింది. ఆఖరికి ఈ ప్రపంచములో పిలవటానికి నాకూ ఒక పేరువుంది. అది చాల అదృష్టం. మీరు కాదంటారేమో. నన్ను చూచి నవ్వేవాళ్ళంతా నా శత్రువులు. లీలకు నా అందవికారాన్ని గురించి చెప్తారేమో! లేక యిప్పటికి చెప్పారేమో అని భయంవేసింది. అయినా ఆమెకు ఏమి తెలుసు - చక్కదనం - అందవికారం, అసలు పగలో రాత్రియో పోల్చనప్పుడు!

ఆమె మర్నాడు వచ్చినది. నేను మా పెండ్లి గురించి ఆలోచిస్తున్నా; ఎట్లా చేసుకోవాలని మా వివాహం ఎవరి సమక్షాన జరుపుకోవాలి! మసీదులలోనికి రానీయరు. ఏబ్రాహ్మలు మా వివాహం జరుపరు. వారు కేవలం ప్రజల సాంఘిక కట్టుబాట్లకి కట్టుబడివుంటారు. దానికి కారణం వారు ప్రజలతోకలసి బ్రతకాలికదా! వారికి దైవచింత తప్ప నాలాటివారి అవసరం అసలు వారికిలేదు. అది నాకు తెలుసు. మగవారికన్నా ఆడవారే ఎక్కువగానున్న ఈ ప్రపంచంలో ప్రతిమతం కొన్ని కట్టుబాట్లకు అంటిపెట్టుకొని వుంటుంది. బహుశ మీకు తెలియకపోవచ్చునేమో నేను మహమ్మదీయుణ్ణి కాని అది యథార్థము. యిట్లా నాలో నేను తర్కించుకుంటు కూర్చున్నాను.

లీలా 'నన్ను వివాహమాడుతావా' అని ఆమె వెనుక అడుగువేస్తుందేమో అని అనుకున్నా. మహమ్మదీయుణ్ణి కాబట్టి బాగా ఆలోచిస్తున్నదని అనుకొని ఆమెతో యిట్లా అన్నా "లీలా నీవు నన్ను మనిషిలాగా భావిస్తే చాలు. దైవమే నిన్ను నా వద్దకు పంపింది. ఈ సాంఘిక మతాచారాలు మనకు అడ్డురావు. మతం, కులం, మనుష్యులు కనిపెట్టినవే. ఆమె పెదవులవైపు చూస్తు హంతకుడు న్యాయాధికారియిచ్చే శిక్షను ఎదురుచూస్తున్నట్లు నేనూ ఎదురుచూచా. నా జీవితంలో బ్రతుకు,చావుఆమె తేల్చాలి; ఆమెమీద ఆధారపడియుంది. మౌనంగాఉన్న లీల మొఖము భావగర్భితంగాఉంది. "నేను నిన్ను సరిగా చూస్తా నీవు నన్ను సుఖపెట్తావనిమాట యివ్వు" అని అన్నా. ఆమె ఒప్పుకున్నానని అంది. ఆమెతో "ప్రజలు నన్ను గురించి చెప్పుకునే మాటలు నిన్ను నరవానరుని భార్యవని అంటారేమో అని అన్ని అర్థంలేని మాటలని పైగా ఆమె అభిప్రాయమడిగా. ఆమె "వాళ్లు మాట్లాడేవన్ని పట్టించుకోను, పైగా

నరవానరుణ్ణి చూడలేదు. నా మనస్సుతో ప్రపంచమును చూస్తా. మీరు మహమ్మదీయులు. నేను హిందువు మీకేమి అభ్యంతరములేకపోతే నాకూ లేదు. నన్ను కృతజ్ఞతతో ప్రేమించేవాళ్లు ఈ ప్రపంచంలో వుండరనుకున్నా కాని ... ... “అనివూరుకొన్నది. నేను ఆత్రుతతో చెప్పుచున్నా.” నాది అభాగ్యపు జీవితం. ప్రతి భారత స్త్రీకి ముఖ్యమైన శీలం నేను మీకు సమర్పించలేను. నేను గ్రుడ్డిదానినైనా నాకూ ప్రేమించాలని వుండేదికాని నా భిక్షాపాత్ర ఎల్లప్పుడు ఖాళీగా వుండేది. నేను బిచ్చమెత్తగా వచ్చేదిచూచి మా కడుపులు విచారంగా నవ్వేవి. అనేక రాత్రులు మాకు శివరాత్రులే. నా బీదరికాన్ని చేరదీసినవల్ల ఏమిలాభంలేదు. యవ్వనంలోవున్నా - ప్రతిఫలం ఏమిలేనిదే ఈ భిక్షుకి భిక్షాపాత్రలు దానంపేరిట ఒక రూపాయి ఎవ్వరూ యివ్వరు. మొదటి రోజు ప్రవర్తన నాకు అదే ఉద్దేశ్యం కలిగించింది. క్షమించండి. ఈ రోజున మానవునిగానమ్మి మిమ్మల్నితప్ప మరెవర్ని స్వీకరించను” అని ముగించింది. నేను ఆశ్చర్యంతోవిన్నా. కొన్ని క్షణాలు మౌనంగా గడచిపోయినవి.

“లీలా నీ అనుభవాలు మానవుని స్వార్థబుద్ధికి గాథలు. వాటిని నేను తిరిగి తలచను.” అని అన్నా. మరి కొద్ది రోజులకు నా ప్రయత్నం ఫలించింది. అది మా గ్రామంలో అలజడికలిగించింది. ఎందుకంటారేమో? ఏ బ్రాహ్మణుడులేకుండా చివరకు పెళ్ళిపెద్దలులేకుండా నేయితరుల సలహాలు చూడలేకుండానే ఆమె - నేను - లీలా – అబ్దుల్లా ఒకరి ప్రక్కన ఒకరం నుంచొని జీవితంలో భాగస్వాములు కావటానికి ఒకరి నొకరం అర్థంచేసుకొని జీవిద్దామని దేవుని మొకరిల్లి అనుకున్నాము. అదే మా వివాహదినం. మా వివాహబంధంకూడా. ప్రజలు నవ్వటానికి మరో అవకాశం దొరికింది. ప్రజలే సంఘం. హృదయంవున్న వాళ్లని సంఘం దూషిస్తుంది. సంఘం కోరేది మానవుడి ఆనందం - క్షేమంకావు. అది కోరేది నమ్రతా విలువలు. మనసులేని ఆనందం. అనుభవము యితరులకు ఎందుకు? అనుకొని సంఘం వాటి వినాశానికి దారితీసే ద్వారబంధాలని నిర్మాణం చేస్తుందని చెప్పేవాణ్ణి. లీల ఆమె తల్లి నా వద్దే వసిస్తున్నారు. మేము సంసారం ఆరంభించాము. పెద్దలు అన్న మాటలు “సంసారం సాగరం దుఃఖం” మాకు వర్తించలేదు. మాది సుఖవంతమైన జీవితమని నేననను. మరీ ఉత్కృష్టమైన జీవితం అనికూడా అనను. మేమిద్దరం కావాలని చేసుకున్న వివాహం. అదే మా జీవితం. మేము హాయిగా వుండాలని ఏమీలేదు. కాని మేము కలసి జీవించదలచాము. కష్టాలు ఎదుర్కోటానికి సిద్ధంగా ఉన్నాము.

లీల చెప్పిన మాటలు నన్ను ఆనందంతో ముంచివేశాయి. లీల తల్లి కాబోతున్నది. ప్రజల వేళాకోళంగాని, వెక్కిరింపులుగాని నా నరవానరరూపంగాని, లీల అంధత్వంగాని దానికి అడ్డంరాలేదు. నా జీవితంలో అనుకోనంత సంతోషం కలిగింది. ప్రేమికుణ్ణి, భర్తను, యిపుడు తండ్రినికూడా కాబోతున్నానని “దేవుని మహిమ ఎంత గొప్పదో” అని అనిపించింది. ప్రసవించటానికి రెండు నెలలుండే జబ్బుపడ్డది. వైద్యుణ్ణి పిలుచుకువచ్చి చూపించాను. దైవాన్ని ఆయన్ని ఆమె జీవితం కాపాడమని ప్రార్థించా. ఆయన ఏమిప్రమాదంలేదని నయంచేస్తానని ధైర్యం చెప్పాడు. కొన్ని క్షణాలుకు మళ్ళీ ప్రశ్నించాడు “పుట్టుకతోనే గ్రుడ్డిదా” అని. అవునని సమాధానంచెప్పా. ఆయన నేత్రాలు పరీక్షించి శస్త్రచికిత్సచేసి కళ్లు నయంచేయుగలనని అది యిపుడు అసంభవమని, ప్రసవించిన తర్వాత ఆరోగ్యంగా వున్నప్పుడు మళ్ళీ తనని కలుసుకొమ్మని చెప్పి మందిచ్చి వెళ్ళిపోయాడు.

ఆయన మాటలు నా హృదయాన్ని జీవితాన్ని చీల్చివేశాయి. ఆమె నన్ను చూడకలిగితే నా జీవితం ఏముంటుంది. అందరిలాగా చూడగలిగితే నన్ను అసహ్యించుకోదూ. నన్ను యిలా ప్రేమిస్తుందా? నేను వైద్యునికి ఏమిచెప్పాలి? లీలా “వైద్యుడు నీకు చూపు తెప్పిస్తానన్నారని” చెప్పా. యంత్రాగారంలోని యంత్రంలా నా మాటలు అప్పటికే

విన్నది. కనుచూపు, జీవితంయొక్క వేళ్లని పెకలిస్తుందని ఎలా చెప్పేది? ఆమె నా హృదయాన్ని బాగా అర్థంచేసుకొన్నది. కానీ ప్రాపంచికముగా అర్థంచేసుకోలేదు దృష్టిరావాలనుకోవటం ఆమె తప్పుకాదుగదా!” పుట్టు గ్రుడ్డికి చూపురావడం ఎంత అదృష్టం! నాకు చూపు వచ్చేటట్లయితే, రావాలనివుంది. మీకు సంతోషం అవునా కాదా! నేను చూడకలిగితే మీరు ఎక్కువగా ప్రేమిస్తారని” లీల అంది. ఆమె జబ్బుతో వున్నప్పటికి ఆమె ముఖం సంతృప్తితో నిండింది. సరి క్రొత్త జీవితం వస్తున్నది. కాబట్టి సరే అట్లాగనే అని యిపుడు కాదు. ప్రసవించిన తర్వాత చేయిద్దామనిచెప్పా. లీల సంతోషంగావుంది. నాలో తుఫాను చెలరేగింది. మనస్సు ఆలోచనలతో వేడెక్కింది. వరండా చివరకుపోయి ఆలోచించాను. ఈ విశాల ప్రపంచములో నాకు ఈ చిన్న గుడిసెలోనే శాంతి లభించేది. అసలు నా ప్రపంచకము చాల చిన్నది. యిపుడు అదికూడా ధ్వంసం అయేటట్లుఅగుపించింది. “ఓయి వైద్యుడా! నీవు నా విరోధులతోకలసి నన్ను హింసించాలని చూస్తున్నావా? కాని దానికన్నా ముందే నిన్ను చంపుతాను. మా ప్రశాంత వాతావరణములో ఎందుకు చిచ్చుపెట్టావు ... ... కాదు నిన్ను నిందించి లాభం లేదు. నీవు జబ్బులతో పోరాడాలి. అంధత్వము భయంకర జబ్బులలో నొకటి. నీ వృత్తి ధర్మాన్ని నీవు కాదనలేవు. లీలకు దృష్టి ప్రసాదించటానికి ప్రయత్నించు. నా గురించి బహుశ నీకు నేమి తెలియకపోవచ్చు. లీలనుకూడా అందరిలాగా చూడనీ. సమస్త జీవరాసులకు అవసరమైన దృష్టిని లీలకు దేవుడు ప్రసాదించకపోయినా ఈ విధంగానైనా ప్రసాదించుగాక. కాని ఆమెకు నరవానరం అంటే ఏమిటో తెలియకముందే నన్ను బూడిదగామార్చు. అప్పుడే నేను ఆమె దృష్టిలో ఓ గొప్ప ప్రేమకునిలా ఉంటాను. ఆమె చూడగలిగితే ప్రపంచకమే లేకుండా పోతుంది. పోలేపోని – అని హృదయం మూగగా రోదించింది.

లీల మగశిశువును సుఖంగా ప్రసవించింది. సంఘం మమ్మల్ని చాల యిబ్బందులు పెట్టింది. కొందరు పెద్ద గాడిదల మాదిరిగా అరచారు. నా వికారావతారముకాని లీల కబోదికావటంగాని శిశువు పుట్టుకకు అడ్డంరాలేదు. ఆ శిశువుకు నా కండ్లు లీల అంగసౌష్టవము వచ్చినవి. ఆ శిశువు అమాయకంగా నవ్వుకుంటున్నాడు.

లీల ఆరోగ్యంగా తిరుగుతున్నది. నాస్వార్థం దేనిని క్రిందికినొక్కి పట్టివుంచినదో. ఓనాడు లీల దానిని జ్ఞాపకం చేసింది. ఆమె మాటలు నాలో తుఫాను లేవదీసినట్లు ఆమెకేం తెలుసు! మర్చిపోయానని అబద్ధమాడా. అబద్ధ మాడుతున్నట్లు నాకు తెలుసుకూడా 'యివాళ నేను వెళ్ళి కనుక్కొని వస్తానని చెప్పా నన్ను ఎవ్వరోసముద్రంలో పడద్రోయుచున్నట్లు అనిపించింది. బయటకు వెళ్ళిన రెండు గంటలకల్లా యింటికి తిరిగివచ్చాను. వైద్యుడు మరణించాడని చెప్పా. అదే నేను చెప్పగలిగింది. అదికూడా చెప్పలేనేమో అని అనిపించింది. మంచి కోసం ఏదైతే చేశానో అదే మనశ్శాంతి లేకుండా చేసింది. ఆ వైద్యుని మరణానికి నేను లీలతో సమానంగా విచారించలేకపోయాను.

కష్టంగా రోజులు దొర్లుకు పోసాగినాయి. ఓ రోజు నేనుయింటికి వెళ్ళేటప్పటికి హృదయం బద్దలవటం అంటే ఏమిటో నాకు ఆరోజు అర్థంఅయింది. లీల తల్లి ఆరోజున పొరబాటున రాగిగుండిగెను గదిలో వుంచి మరచిపోయింది. లీల ఏడ్చుచున్న పిల్లవానికోసం వెళ్తూ కాలుగుండిగకు తగిలి పడిపోయింది. ఆపడటంలో బలంగా గుమ్మానికి తగిలి నెత్తురు వరదలు అయింది. వెంటనే ఆమెను ఆసుపత్రికి తీసికొని వెళ్ళా. జీవితాలు నశించి పోతున్నాయి. నా సుఖజీవితం ఎడారిగా మారింది. ఈ సమయంలో ఎవ్వరైనా నవ్వగల్గుతారా? యిప్పుడు ఫిర్యాదులు ఏమీ లేవు. ఉన్న ఎవరు విచారిస్తారు. లీల నా జీవితేశ్వరి ... ... యింతలో వైద్యుడు ఆమెకు చాలా బలమైన గాయాలు తగిలా

యని పరిస్థితిచాల ప్రమాదమని చెప్పాడు. ఆమె మూలుగుతూ పడుకొన్నది. నేను వెళ్ళంగానే "మీరు వచ్చారా! నేనుపోతున్నాను. మిమ్మల్ని ఒక్క తడవ చూస్తే బాగుంటుంది" అని దుఃఖించ సాగింది. ఆమె మాటలు నా ఓర్పును పరీక్షించుతున్నాయి. ఆమె వైద్యుడు చనిపోయాడని దుఃఖిస్తున్నదేమో! ఆమె ఆఖరికోరిక నేను సహించలేక పోయా.

"లీలా! కళ్ళతో చూడటంఒక గొప్పపని కాదు. ఎవ్వరూ తమ చూపులతో అర్థం చేసుకోలేని నన్ను నీమనో నేత్రంతో చూచి సరిగా స్పష్టంగా అర్థం చేసుకోగలిగావు. మనుష్యులు మామూలు చూపులతో సరిగ్గా అర్థం చేసుకోలేరు. ఈర్ష్యతో నిండివుండే నేత్రాలే వాళ్ళకూ ఉండేవి. ప్రశాంతంగా కాలం గడుపు. త్వరలో కోలుకుంటావు" అని అన్నా. లీలచే చెప్పినవన్ని వినివుండవచ్చు. కొన్ని క్షణాలు మౌనంగా దొర్లి పోయినాయి. లీలఏడ్వటం మొదలు పెట్టింది. నేను తీవ్ర ఆవేదనలో పడిపోయినా. దాచబడిన ఆ భయంకరం రహస్యం బయట పడేటట్టున్నది. అక్కడ ఒక్క క్షణంకూర్చోలేకపోయాను. లీల తల్లి లీల ప్రక్కన పాపనుపడుకోబెట్టింది. ఆ ఆ పిల్లవాడు ఏడ్వటం మొదలు పెట్టాడు. లీలతల్లి ఏడుస్తున్నది. నేను ఒకరిని ఓదార్చలేను; నన్ను ఓదార్చేవారు ఎవరూ లేరు.

లీల ఆత్మసూర్యునితో బాటు నిష్క్రమించింది. పడమటి ఆకాశంలో సూర్యుడు ఎర్రగా అవులించి మరోప్రపంచములో మూర్ఛిల్లిపోతే మిగిలినవి పగటిని వదలలేక రాత్రికి వెతుక్కునే మత్తు మేఘాలు, నక్షత్రాలు భయంతో మెరుస్తున్నాయి. నేనేం చేశానో తెలియలా. ప్రజలు యిప్పటికీ కూడా నన్ను చూసినవ్వుతారు.

నేనుకూడా గ్రుడ్డివాడిని అయితే నా కథ ఎలా వుండేదో అని చాలాసార్లు ఆలోచించేవాడిని.

# సిరిసిరిమువ్వలు

ఒక కవి తాను రచించిన గ్రంథమును మరొక పండితునకు చదివి వినిపించి అభిప్రాయమును తెలుసుకోకోరాడట. ఆ పండితుడు ముక్కు పొడుంఘాటుగా పీలుస్తూ జేబు తడుముకొన సాగాడట.

కవి "ఏమిటండీ! జేబు తడుముకుంటున్నారు" అని అడిగాడు.

పండితుడు "ఆ-ఏమిలేదు; తలనొప్పి మందుకు డబ్బులకోసం దేవులాడుతున్నాను" అన్నాడు.

♦ ♦ ♦

ఒక పల్లెటూరి పాఠశాలలోని విద్యార్థిని పిలచి మాస్టరు "వేణూ! ఒక గొయ్యి తీయరా, స్తంభం నాటాలి" అన్నాడు.

"నేను తీయనండీ"

"ఏంరా! పొగరెక్కినట్లున్నదే-తీస్తావా తీయవా? లేకపోతే..."

"అదికాదండీ! - మీరేగా నిన్న చెప్పారు - ఎవరు త్రవ్వుకున్న గొయ్యిలో వాళ్లే పడతారని."

♦ ♦ ♦

మాష్టరు "గోపీ! చెయిర్‌మన్ అంటే అర్థము ఏమిటిరా?"

"చెయిర్ అంటే కుర్చీ, మాన్ అంటె మనిషి. కాబట్టి కుర్చీమనిషియని."

"ఛీ! వెధవా! అదట్రా అర్థం - పోనీ మానీటర్ అంటే అర్థమేమిటో చెప్పు."

"మాన్ అంటే మనిషి, యీటర్ అంటే తినేవాడు - మనుష్యులను తినువాడని అర్థమండీ."

"నీ తెలివి తెల్లవారినట్లున్నది - అన్నీ తప్పులే - పోనీ వాచ్‌మన్ అంటే ఏమిటో చెప్పు."

"అది తెలియకేమిటండీ! - వాచ్ అంటే చేతిగడియారము, మాన్ అంటే మనిషి - చేతిగడియారం మనిషి అన్నమాట."

వేమూల కుటుంబరావు

♦ ♦ ♦

ఒక స్త్రీ ఉబ్బసంతో బాధపడుతూ డాక్టరు దగ్గరకు వెళ్లి "నేను యింతకుముందు చాలమంది వైద్యులదగ్గర చికిత్స పొందానుకాని ఏమిగుణంలేక పోయింది. మా స్నేహితురాలు మీరు చాల అనుభవంకలవారని చెప్పగావిని వచ్చాను" అన్నది.

"నిజమే—నాకు యీ ఉబ్బసంవ్యాధి యిరవై సంవత్సరాలనుండి యున్నది" అన్నాడా డాక్టరు.

ఒకలావాటి ఆయన పోర్టరు సామానులు నెత్తిన పెట్టుకొని వెనుకనడుస్తూ రైలు ఎక్కబోతుండగా పోర్టరు "ఏమండీ! మీ సామానులతో బాటు మిమ్ములను రైలుపెట్టెలోకి ఎక్కించడానికి మీరు అరణాలు అదనంగా యివ్వవలసియుంది" అన్నాడు.

♦ ♦ ♦

ఒక రోగి డాక్టరుతో ప్రక్కనే నిలబడియున్న నర్సును చూపిస్తూ "డాక్టరుగారూ! మీ రిక్కడ చాల మంచి నర్సును ఏర్పాటుచేయకలుగడం సంతోషము. ఆమె చేతులు నన్నొకసారి తాకేసరికి జ్వరం మాయమైపోయిందండీ" అన్నాడు.

"మాకు తెలుసు - వసారాలో నిన్న ఆమె కొట్టిన చెంప దెబ్బ శబ్దాన్ని విన్నాము" అన్నాడు డాక్టరు.

♦ ♦ ♦

ఒక ఆంగ్ల యువకుడు తాను వివాహమాడ నిర్ణయమైన యువతిని "నాతోనే కాకుండా మరిద్దరితో సంబంధమున్నట్లు తెలిసింది - నిజమేనా" అని అడిగాడు.

"నిజమే అయితే మాత్రం నీ వనేది ఏమిటి" అన్నది ఆ యువతి తీవ్రంగా.

"ఆ - ఏమిలేదు - వివాహపు ఉంగరమును ముగ్గురంకలసి కొందామని" అన్నాడు మెల్లగా యువకుడు.

♦ ♦ ♦

ఒక తరగతిలో ఆంగ్ల ఉపాధ్యాయుడు నీతినిబోధిస్తూ "మాట్లాడేముందు తొందర పడరాదు. ముందు ఆలోచన అవసరం. ఏదైన ముఖ్యమైనది మాట్లాడుటకుముందు 50 ఒంట్లు, అత్యంత ముఖ్యమైనది మాట్లాడవలసి వచ్చినప్పుడు నూరు ఒంట్లు మనస్సులో లెక్కబెట్టి యితరులతో మాట్లాడుట మంచిది" అని బోధించాడు.

మరునాడు చలికాచుకోడానికని యున్న నిప్పుకుముందు ఆయన నిలబడి మాట్లాడుతుండగా ముందున్న పిల్లల పెదవులు శరవేగంగా కదలసాగాయి.

పిల్లలందరు ఒక్కుమ్మడిగా "తొంబై ఎనిమిది, తొంభై తొమ్మిది, నూరు. మీకోటుకు నిప్పంటుకున్నది" అని అరిచారట.

'నారపీచు'

♦ ♦ ♦

ఒక సీతాకాలపు రాత్రి నలుగురు మిత్రులు కాఫీ హోటలుకు వెళ్లారు. అందులో ఒకడు బాదంఖీర్ కు ఆర్డరిస్తే త్రాగారు. మరొకడు "ఒళ్లంతా చల్లబడిపోయింది; వేడివేడి కాఫీ అత్యవసరం" అన్నాడు.

కాఫీ తెచ్చి పెట్టిన సర్వర్ "కాఫీ త్రాగగానే చల్లదనానికి పానీయం వద్దా!" అన్నాడు హేళనగా.

'అవసరం లేదు. నీవిచ్చినబిల్లుచూస్తేనే మా ఒళ్లు చల్లబడుతున్నది' అన్నాడు బిల్లునందుకున్నవ్యక్తి.

"అర్జున్"

# బెదరిన హృదయం

శ్రీమతి మునిపల్లె సరస్వతి

ఆరోజరుణ రేఖలాకాశాన్నంతానలంకరించాయి. పిల్లవాయువులతో పూభారంగావున్న పూమొక్కలు తలలూస్తున్నాయ్. శుకపిక నినాదాలు చైతన్యాలకు అంతులేదు. ఇల్లాండ్రు పనులన్నీ చక్కబెట్టుకొని, ద్వారాలముందు నిలబడి వొకరినొకరు ప్రశ్నలు వేసుకుంటున్నారు. "ఏం వదినా! ఏంటీ కథ!" అని రంగమ్మ వదినను ప్రశ్నిస్తోంది పల్లెముఖి మెరుగని పున్నమ్మ. రంగమ్మ పెదవి విరచి "అంతా చోద్యం! నేనొక ఆలిండియా రేడియో నయ్యానుగాబోలు! మీవార్నడగరాదంటే పిల్లా!" అని రంగమ్మ నీళ్ల తూగతో దాటిపోయింది.

కాంతం యింటిపని యింకా కాలేదు. జలుబు భారంతో జ్వరంతో పాపం మూలుగుతూ వంటచేసుకుంటోంది. ఇంటిలో బిడ్డాపాపలేరు. ఆరోజు కాంతం యిల్లు హీనస్వరంతో మూల్గుతోన్న రోగిలావుంది. పెండ్లయిన క్రొత్తల్లో కాంతం యిల్లు కళకళలాడిపోయింది. ఈ రోజు చిక్కి శల్యమైన మస్తిష్కంలా వుంది. వంకాయకూరకు పోపుపెట్టి కాంతం అటక మీది అద్దం చూచుకుంది. కాంతం గుండె ఝల్లుమంది. "ఇదిగో పారూ! చూడూ, నీ చంద్రబింబంలాంటి నీ ముఖానికి యీ మచ్చ" ... అని దేవదాసు పార్వతిని అనినమాటలు జ్ఞప్తికొచ్చాయి. పాపం అమాయకురాలగు కాంతం హృదయం సముద్రతరంగాల్లా ఘోషించింది. ఎక్కడలేని ఆవేశం వొక్కసారి పొంగింది. తెలియనిరీతిగా కంటి వెంట నీటిబిందువులు జగేల్ మంటూ అద్దంపైరాలిపోయాయి. 'పిచ్చిదానా! - కాంతం. ఇదిలోకమమ్మా! నీకు తెలియదూ... ఇరువది రెండ్లేడ యువతివి. ఎందుకలా మెట్టినింట కన్నీరు, కారుస్తావు?" అని అత్తగారియాత్మ ప్రబోధించింది. కాంతం తలకట్టు సరిచేసుకొని కన్నీళ్లు తుడుచుకొని వంటగది సర్దుకుంది. కాంతం జీవితం ఆరోజుకారోజుకు దుర్భరంగావుంది. గడపమీద కూర్చొని రెండుచేతులు చెక్కిళ్లకు చేర్చి 'యీలాంటి హృదయాలెన్ని దగ్ధమయిపోతున్నాయో గదా! ...' అని కాంతం లోలోపల పలవరించింది. ఇల్లంతా గల్లంతుగావుంది. కాంతం మనసు బిక్ బిక్ మంటోంది. కారాగారంలోనున్న ఖైదీకైనా స్వేచ్ఛ వుంటుందేమో గాని కాంతానికి మాత్రం మనోవ్యధచేత యిల్లు అపరకారాగారంగావుంది. ఏమి చేస్తుంది? పుట్టింటికి వెళ్ళ ప్రయత్నించింది ఎన్నోసార్లు. అప్రయత్నంగా కాంతం మూటాముల్లెసర్దుకొని ప్రయాణమయిన రోజులెన్నో వున్నాయి. కాని తెలియని రీతిగా ఎలక్ట్రిక్ షాక్ కొట్టినట్లుగా కాంతం పుట్టింటికి ప్రయాణం సున్నజుట్టేది. తానెవరి కొరకై ఎదురు చూస్తోందో ఆవ్యక్తి యింకను యింటికి రానేలేదు. ఈసారితో కాంతం మనసు దృఢపర్చుకుంది. వేకువనే పుట్టింటికి ప్రయాణం ... అనుకుంది

"బావా! ... నామనః పూర్వక నమస్కృతులు. మనకు వివాహమైన తొలిదినాల్లో మనమైత్రి ఏ విధంగా వుండేదో అర్థం జేసుకో ... నీ కంటే విజ్ఞానంలోను, వయసులోను నేతక్కువే.... నేను నీ బలవంతమగు రోకలిబండదెబ్బకు ఎంత వోర్చుకున్నానో నీకు తెలుసు. అంత రక్తము నాతలనుండి ప్రవహించినప్పటికిని నాకంట కన్నీరు తిరుగనేలేదు. బావా! నాలో ఏ తప్పు జూచికొట్టావో నాకే తెలియదు. మనయిరువురిమైత్రికి చెలియలి కట్టకతె

నున్న అత్తగారు మరణించుటయే నాకీయవస్థ. మీ కాసుఖసౌఖ్యాదులు. నీకు ఋణపడియున్నందుకే నారక్తాన్ని నీవుచూచి సహించగల్గావు. ఈ కట్టుగుడ్డను పాపచూచి అడిగితే ఏమని చెప్పాలో దిక్కుదోచకున్నది. నిన్ను చూసే భాగ్యం నాకులేదనుకుంటాను. పెండ్లయిన క్రొత్తల్లో మన ఎదురింటి దంపతులు కొట్టుకుంటూంటే నాతో మీరేమన్నారు! "కాంతం! నిన్ను ఎన్నడూ పశువులాప్రవర్తించి కొట్టను." అని నాతో కిటికీముందు అనలేదూ! గడచిన మాటలెందుకు కదు బావా! బావా!... ఇకశలవు.

ఇట్లు
అభాగిని కాంతం

ఆ వుత్తరాన్ని పదేపదేతనలోతాను చదువుకొని వెక్కి వెక్కి ఏడ్చింది. భక్తవత్సలం బావగదిలోకి వెళ్ళింది. తలుపులు వారగా వేసివున్నాయి. గోడకు గోఖలే గాంధీ, క్రీస్తు మొదలగు మహా పురుషులచిత్రాలు అందంగా వున్నాయ్. గోఖలే చిరునవ్వు కాంతాన్ని వోదారుస్తున్నట్టనిపించింది. క్రీస్తు సహనధర్మాన్ని కాంతానికి వుపదేశిస్తున్నట్టే కాంతం కంటి పాపల్లో మసలుతూంది. ఆయన ఫోటోనుచూసే కాంతం పుట్టింటి ప్రయాణాలెన్ని సార్లో ఆపివేసింది. బావ గది చిందరవందరగా వుంది కాంతానికి. తానువ్రాసిన వుత్తరాన్ని డ్రాయరుమీద చిన్న పుస్తకం క్రింద దాచింది. గదంతా సర్ది వెనక్కుదిరిగి చూసింది. భక్తవత్సలం 'కాంతం, కాంతం' అని పిలిచినట్లనిపించింది. ముకుళించిన పద్మములా ముఖం ముడుచుకొని వాడిపోయినట్లయింది. చిందరవందరగానున్న కుర్చీలన్నీ సర్దింది. ఎన్నిసార్లు తనను బావపిలుస్తున్నప్పటికిని వెనుకకు తిరిగి చూచినా బావ ముఖం నిజంగ భయంకరంగా కన్పిస్తోంది కాంతానికి.

2

"వెంకమ్మపిన్నీ! మీ అమ్మాయి వస్తోంది. రావమ్మాబయటికి" అంటున్నారు యిరుగక్కలు. కాంతం చిన్ననాటి స్నేహితురాలు కాత్యాయని ఎదురు వెళ్ళి "కాంతం! కాంతం! ఏంటే యీ కట్టు?" అని తన సుకుమారమైన హస్తాలతో కాంతం ఫాలభాగాన్ని నిమిరింది. కాంతం మనసు భగ్గుమంది. కురుపుతో అసలే బాధపడుతోంటే దానిమీద కారం చల్లినట్టు యీ స్నేహితురాలిమాటలింకా కలతపెట్టాయి పాపం కాంతాన్ని. 'కాదు — కచ్చీ! మొన్న డాబాగోడలకు సున్నంరాస్తూంటే నిచ్చెనమీదనుండి జారి పడ్డాను' అంది వ్యాకులతగా. కాని కాత్యాయని నమ్మలేదు. "నిజం చెప్పడంలేదు అమ్మ దొంగా"! కాంతం నాకు చెప్పవా? అని త్రోవలోనే నిలవేసింది కాత్యాయని. కాంతానికేమీ పాలుపోలేదు. ఏ విధంగానో తప్పించుకొని కాంతం పెంపుడమ్మ వెంకమ్మయింటికి చేరింది. 'అమ్మా! అమ్మా! నాన్నగారు రాలేదేమ్మా? ... నాకేమి తెచ్చావు? అనిమూడేళ్ళ మారుతి ముసిముసి నవ్వులతో కాంతాన్ని పెనవేసుకుంది. మారుతి అమ్మ నడుమును వదలి వొక్కసారి అమ్మ ముఖం వంకచూసింది. మారుతి పెదవులు తడబడ్డాయి. "అమ్మా! ఏంటే ఆకట్టు? చెప్పవూ? ... కూర్చో అమ్మా కూర్చోవే..." అని మారుతి పంతంగా అరుగు మీదకులాగింది. యీ సంభాషణంతా విన్న వెంకమ్మ గారు కంచుచెంబునీళ్ళతో గబగబా బయటకు వచ్చింది. "కాంతం వొక్కదానవే వచ్చావేమే? ... అబ్బాయిరాలేదూ ..." అని వెంకమ్మచెంబు కాంతం కాళ్ళముందు పెట్టింది. వెంకమ్మ కాంతం ముఖం చూసేసరికి లోపలనుకుంది. ఇదేదో కథ జరిగిందని. కాంతం కాలిపోతున్న హృదయవేదనతో కథంతా వెంకమ్మకు చెప్పకోలేక పోయింది. లాలన పాలనలతో వెంకమ్మ అడిగిచూచింది. కాంతం బయటికి రానీయలేదు. కాంతానికి కష్టసుఖాలు చెప్పకోడానికి అండాదండా లేకపోయారు. 'నా' అనే దిక్కులేకపోబట్టే యిన్ని కష్టాలు ముందునిల్చాయి మురిపెముతో పెంచిన తండ్రి స్వర్గస్థుడయ్యాడు వివాహంచేసి ... భర్త చనిపోగానే వెంకమ్మకు కాంతంమీద మోజు తీరిపోయింది. వెంకమ్మకు

సుబ్బమ్మగారు పంతులుగారి భార్య అన్నపూర్ణమ్మ వాళ్లు చెప్పినమాటలు కాకరకాయలకు కారంబట్టినట్టు పట్టినయ్. "వెంకమ్మపిన్నీ! చూడు. పెళ్ళయిన తర్వాత మనపుట్టింటి వాళ్ళను మనంమర్చిపోలేదూ! ఇపుడు మన పుట్టింటివాళ్ళ ననుకుంటున్నామా? ... ఏదో అందగా వుంటాడు – మీవారి తమ్ముడుకొడుకులున్నారుగా మూడోవాణ్ణి దత్తు తీసుకో ... నీకు మంచిది." అని నూరి పోశారు. కాంతం పెండ్లయిన నాల్గుమాసాలకే వెంకమ్మ పిల్లవాణ్ణి పెంచుకుంది. అది కాంతానికి కొంచెం కష్టంగా తోచింది. కాని పెండ్లయిన తొలిదినాల్లో భక్తవత్సలం బాహువుల్లోపడి మర్చిపోయింది. ఇప్పుడు మాత్రం కాంతం శరీరం కంపించిపోతోంది. వెనుక గొయ్యి ముందునుయ్యిలావుంది కాంతం జీవితం! వెంకమ్మ అల్లున కెన్నో వుత్తరాలు వ్రాయించింది. ఒక్కదానికీ జవాబు వచ్చినట్టులేదు. నాల్గుమాసాలు నిండిన కాంతం నానాయాతనలు పడుతోంది. వెంకమ్మ పెంపుడు కొడుకు భ్రమలోపడి కాంతాన్నే మర్చిపోయింది. స్వర్గీయులైన కాంతం తండ్రి నేర్పించిన చిన్ననాటి సంగీతం తప్ప కాంతంలో నిల్చి పోయిన విద్యయేమీ లేదు. రోజురోజుకు వెంకమ్మగారి చీత్కారాలు ఎక్కువయ్యాయి. కాంతానికి కూతురుచెప్పిన వుపాయమే బాగని పించింది.

ఆరోజు దసరా ... పిల్లలు క్రొత్తబట్టలు ధరించి అయ్యవార్లతో 'జయీభవ! దిగ్విజయీభవ! అంటూ చందాలకు వస్తున్నారు ప్రతియింటికీనూ ... మారుతి చింకిబట్టలతో అమ్మతోపాటు కుక్కిమంచంలో కూర్చుంది దొడ్లో జామచెట్టుక్రింద. పాటలు, పద్యాలు విన్పిస్తున్నాయి, కాని మారుతి అమ్మను వదలి వెళ్ళనేలేదు. కాంతం తనలోతాను పెదవివిరచి ... "మారుతీ! నీవుగూడా పోయి చూడమ్మ!" అని తలనిమిరిందిబరువైన కళ్లతో... మారుతి చిత్రచూపులు చూసింది అమ్మవైపు. మాతృహృదయం క్రుగ్గిపోయింది. ఉదయకిరణాలు పచ్చని తోరణాలలోనికి చీల్చుకొని చొచ్చుకొని వస్తున్నాయి వసారాలోకి. వెంకమ్మ పొయిదగ్గరపనిలో మునిగివుంది; "అమ్మా! ఎక్కడైనా సంగీతం చెప్పరాదా!" ... అని మారుతి తనకుతోచిన వుపాయాన్ని వెలిబుచ్చింది మరోసారి ... కాంతం విని 'సరేలేమ్మా' ... అంది ముక్తసరిగా ... మారుతి అడ్డప్రశ్నలెన్నో వేసింది. 'నేను నాన్నారిదగ్గరకు పోయివస్తాను నన్ను పంపవా అమ్మా!' అని మారాం చేసింది. కాంతం 'వద్దమ్మా!' అని అనేసరికి మారుతి బిక్కమొఖం వేసింది. 'అమ్మా! నిన్ను నాన్నగారు, కొట్టారా?' ... అంది వుండలేక మారుతి. 'కొట్టలేదు, మీనాన్నగారునన్ను కొట్టడం ఎప్పుడైనా చూశావా? ...' అంది కాంతం. మారుతి ముఖం వికసించింది. కాంతం చీర గాలికి రెపరెపలాడింది.

### 3

ఆనాోక పెద్దమేడ. సుందర భవనంలా వెలిగి పోతోంది. సిరిసంపదలతో తులతూగుతున్న రాజ భవనంలోనివారికి యభాగినుల పవిత్రజీవితాలెలా స్ఫురిస్తాయి? ... ఆ భవనానికి తగినట్టు రూప లావణ్యవతియగు నవయవ్వన నారీమణి నాట్యమాడుతూన్నట్టు తిరుగుతోంది. ఆమే ప్రస్తుతం భక్తవత్సలం ప్రియురాలు. వారిద్దరొకే ఆఫీసులో వుద్యోగంచేస్తున్నారు. ఆమె టైపిస్ట్‌రాణి. కథ బాగానే జరిగిపోతోంది. తల్లితోవున్న లలిత భక్తవత్సలంతో భోగాలకు లోనయింది. వచ్చిన సొమ్ము వచ్చినట్టే విలాసాలు!

రాత్రి 12 గంll ల సమయం. నలుగురు పెద్దలు 'భక్తవత్సలం! తలుపుదియ్ ... ఊ ... పొడుస్తా!' అని కత్తి ఎత్తిన వ్యక్తికి అడ్డువచ్చిన తన అర్ధాంగిని జూచి, భక్తవత్సలం మేల్కాంచాడు. తన కండ్లను తానే నమ్మలేకపోయాడు. గదిలో పరుండియున్న తనను బయటి వసారాలోకి పంపినదెవరో తనకే తెలియదు. వెంటనే తన కాంతం కంటిముందు నవ్వినట్లు

తోచింది. కాంతం పాదాలమీదపడి క్షమాభిక్ష పెట్టమని కోరుకుందామనుకున్నాడు. తన శరీరం తానే మెల్లగా గిచ్చుకున్నాడు. — నిజమే తానున్నది గదిలో గాదు. బయటివసారాలోని వో ప్రక్క పడివున్నాడు. భక్తవత్సలం మనసుకు అంతా వింతగావుంది. ఏంచేయడానికి తోచలేదు. లలిత ఏమైంది. తలుపు తడదామనుకున్నాడు. లలితను కష్టపెట్టడం యిష్టంలేదాతనికి. ధైర్యంచేసుకొని పక్కమీదనుండి లేచాడు. అగ్నిసాక్షిగా వివాహమాడిన కాంతం మొహాన దుమ్ము చల్లాసేయని భక్తవత్సలం మనసు చాల బాధపడింది. మెల్లగా వరండా మెట్లు దాటాడు. భక్తవత్సలాన్ని ఎరుగును గనుక సీమకుక్క నోరు మూసేవుంది. నందివర్ధనచెట్లు పాలవెన్నెల్లో వెన్నముద్దల్లా ముచ్చట గొల్పుతున్నాయ్. చెట్లను చాటు చేసుకొని మేడపైకి ఎక్కాడు. ఆ ఇంటిలో మెలగినవాడికి ఆ యింటి కీలకాలు తెలియకుండా వుంటాయా!... మేడమీదకు అల్లుకొనివున్న మాలతీ తీగ గాలికి రెపరెపలాడుతూవుంది. పరిమళం విరజిమ్మతోంది. అద్దం అతికివున్న గది దగ్గరకు వచ్చాడు. చెవిఆన్చి కూలబడ్డాడు. ఏవో క్రొత్త మాటలు విన్పిస్తున్నాయ్. పాపం భక్తవత్సలానికి వెర్రిఎత్తినట్లయింది. తన కండ్లను తానే నమ్మలేక పోతున్నాడు. తన కండ్లముందలాంటి సంఘటన ఎన్నడూ జరుగలేదు. అతని బుఱ్ఱమీసాలు, వినాయకుని బొజ్జ, విలాసంగా వికవిక నవ్వుతున్నాడు. లలిత వీవనతో విసరుతోంది గదిలో... (బొమ్మ) ద్వారంలో ముగ్గురు కావలివాళ్లు. వాళ్లు యితని పరిచారకులై యుంటారని గ్రహించాడు. వాళ్ళ చేతుల్లో తళతళ మెరుస్తోన్న కత్తులు కన్పించాయి. ఆ సన్నివేశాన్ని చూస్తున్నకొలది భక్తవత్సలానికి భయం ప్రబలమైపోతోంది. మేడదిగి పండుకుంటే పట్టుకొని చంపుతారేమోపోతూ ... ఆ నున్నపు పొరలమధ్యే సొక్కి నిద్రించాడు భక్తవత్సలం. చందమామ పకపక నవ్వుతూ పండువెన్నెలను ప్రసరిస్తున్నాడు. అతని పెదవులనుండి యప్రయత్నముగా 'కాంతం! నా చిట్టీ!' అనే మాటలు వెలువడ్డాయి.

కాంతం శూన్యం ... శుష్కించిన శరీరంతో కాంతం మట్టిగాజుల మోతవలె ఎముకలతో నిండివుంది. ఆమెలో మిగిలింది ఎముకలే. ... అతని కన్నులనుండి జలజల నీళ్లు ధారగా ప్రవహించాయి. లలిత యిల్లు పాపభూయిష్టం! నిజం కాంతం చెప్పినమాట. ఆమె మాటలు వినక ప్రవర్తించినందులకిది శాస్తి. అంతా భగవంతుని చిత్రం! యీ వచ్చిన నలుగురే తన మంచాన్నిఎత్తి బయటపెట్టి, లలితతో కాలం గడుపుతున్నారని గ్రహించాడు.

## 4

కాంతం సొమ్మంతా మాయమయినది. వెంకమ్మగారు పెంపుడు కొడుకును పట్నం చదువుకు పంపడములో కాంతం జీవితం కాలిపోయింది. మారుతి చెప్పినట్టుగా కాంతం నాల్గుచోట్ల సంగీతం ట్యూషన్లు ఏర్పాటుచేసుకుంది ... కాంతం దారిద్ర్యం కొంత వరకు మాయమయింది. భర్తలేని కారణంచేత ఆమె ముఖం వికసించనేలేదు. 'లోకులు కాకులువంటి వారు. పాపం అన్నెం పున్నె మెరుగని కాంతంపై ఎన్నో వట్టి మాటలు కల్పించారు. కాంతం జీవితం మంటగలపాలని ప్రయత్నించారు యిరుగు పొరుగు వారు. కాని బాల్యస్నేహితురాలగు కాత్యాయని కాంతాన్ని ఆదరించింది. కాంతం పంథా మారింది. కాత్యాయని బి. ఏ. చదివి వున్నత హోదాలోవుంది. అవివాహిత. తనకున్నదాంతో కాంతం కాపురాన్ని కలిపివేసుకుంది. విద్యావంతురాలగు కాత్యాయని కాంతం కష్టాలను గుర్తించింది. కాంతం భారం కాత్యాయని వహిస్తోంది. "కాత్యాయని కేందుకీ యభిమానం? కాంతం జీవితభారాన్ని కాత్యాయని వహిస్తోందని ఎత్తిపొడిచారు కొందరు. కాని చదువరియైన కాత్యాయని జంకలేదు. కొందరు రౌడీలు కాత్యాయని యన్నయగు వరప్రసాద్‌కు, కాంతానికి సంబంధం వున్నట్లు రూఢిచేశారు. సత్యమే జయమన్నట్లు, పవిత్రుల స్నేహాలు పవిత్రంగానే వుంటాయి. వారి వూహాసౌధాలు కూలిపోలేవు. వారి యాంతరంగిక నిర్మాణాలే వేరు. పతిత అని

ఎంచబడిన కాంతం నిజంగా పతితేనా ? ... కానేరదని కాత్యాయని ప్రతివాదం !! కాంతం రోజులలాగే దొర్లిపోతున్నాయ్. లోకుల మాటలు లక్ష్యపెట్టక కాంతం కాత్యాయని యింటిలో పురుడు పోసుకో నిశ్చయించింది.

◆ ◆ ◆

"లలితా ! నిజంచెప్పు. ఎవరా పెద్ద మనిషి ?" అన్నాడు భక్తవత్సలం. జేవురించిన కండ్లతో. ఆ మాటలువిన్న లలిత ఆశ్చర్యపడింది. ఆఫీసు నిశ్శబ్దంగావుంది. మధ్య మధ్య వీరి సంభాషణ వింటోన్న రమణ అదోలా చూస్తున్నాడు. రమణ లలితవైపు చూస్తున్నాడు. లలిత ప్రేమఖండంకోరకు ప్రయత్నించి విఫలుడయ్యాడు రమణముందే. ఇదే తరుణమని ముసి ముసి నవ్వుల్తో రమణ లలిత చూపులకు అడ్డుచూపులు విసరుతూ నిడివిగా పోనిస్తున్నాడు. లలిత భక్తవత్సలంతో "ఇది ఆఫీసు సుమా ? .. ఏంటీ గోల !" అంది చిరాగ్గా. భక్తవత్సలం వొళ్లు మండిపోయింది. తనలో తాను పేలవంగా నవ్వుకున్నాడు. లలిత వుదయం కాఫీయిస్తే కందిపోయిన ముఖంతో గంట సేపు చూశాడు గ్లాసులోకి. చీకూ చింతా లేని లలిత యిచ్చిన కాఫీని చెత్తకుండీ చేత త్రాగించాడు. పెద ముఖాల్తో ఆఫీసులో ఎవరిపనివారు చూచుకున్నారు. లలిత సైకిల్ బెల్ మ్రోగిస్తూ త్రోవలో రమణను కలుసుకుంది. వారిద్దరి వైఖరిని ఆఫీసు తాళంవేస్తూ భక్తవత్సలంచూచి క్షణకాలం స్తంభించిపోయాడు. భక్తవత్సలం కోపంతో లలిత యింటికి పరుగుదీశాడు. లలిత యింటికిరాలేదని ముసలమ్మ చెప్పింది. పట్టరాని కోపంతో తన కొంపకు జేరాడు. ఇంటి తాళాలు బూజుపట్టి వున్నాయి. బలంకొద్దీ వాటిని పగులగొట్టాడు. ప్రతి వస్తువు దరిద్రంతో మూలుగుతున్నాది. ఎన్నోసార్లు యిల్లంతా గస్తీ దిరిగాడు. ఆనాడు కాంతం వ్రాసిన వుత్తరం చేతికి దొరికింది. చేతులు గజగజ వణకాయి. కుర్చీలో కుంటివానిలా కూలబడ్డాడు. కాస్త మెదడు ఎన్నో వూహాల్తో పెకల్చివేసింది. కాంతం దగ్గరకు ఏముఖంపెట్టుకో వెళ్లడం ? ...

◆ ◆ ◆

కాంతం కాత్యాయని యింటిలో ప్రసవించింది. ఆడపిల్ల కాంతానికి — బాలింత జబ్బు పైబడుటచే కాంతం పురిటిమంచంలోనే కన్నుమూసింది. తొలకరి చినుకులు చిటపట పడ్తున్నాయ్. పురిటిమంచంలో పిల్ల కెవ్వుకెవ్వున అరుస్తోంది. కాత్యాయని పిలిపించిన నర్సు దాటిపోయింది. భక్తవత్సలానికి ప్రసాద్ ఫోను చేశాడు. వెంకమ్మకు పట్టిట్టియేడుపు లెక్కువయ్యాయి. అయిదేళ్ళ మారుతి అమ్మకోసం అలమటించిపోయింది. కాత్యాయని కన్నులు చెమ్మగిల్లాయి. తీరని ఆశలతో కాంతం దాటిపోయింది. భర్త రాకకోసం అంతా ఎదురుచూస్తున్నారు. ఉదయం 10½ గంటలకు కాత్యాయనిగారింటిచుట్టూ జనం క్రిక్కిరిసి వుండిపోయారు. జనాన్ని త్రోసుకుంటూ యువకుడొకడు వెక్కి వెక్కి ఏడుస్తూ వస్తున్నాడు. మేడమెట్లనుండి బెదరిన హృదయంతో చూస్తూవుంది కల్లోలమంతా కాత్యాయని.

వెంకమ్మ అల్లుణ్ణి కౌగలించుకొని భోరున ఏడ్చింది. కాంతం ముందు కూర్చొని భక్తవత్సలం గగ్గోలు చేయ నారంభించాడు. తాను చేసిన పాపాన్నంతా వెలిబుచ్చాడు. మెట్లమీదున్న కాత్యాయని హృదయం భగ్నమైంది. కన్నులు చింతనిప్పుల్లా వుండిపోయాయి. "దిక్కులేనివాళ్లగాజేసే యీ దుష్టునికిదే ప్రాయశ్చిత్తం !" అని మనోద్ఘాటన కాత్యాయనికి. కాంతం జీవితం కాత్యాయని హృదయంలో నాటుకుపోయింది. తాను వివాహం చేసుకోడానికి వెనుకాడేది ఎవరన్నా వచ్చినప్పుడు. కాంతంపిల్ల పురిటిలోనేపోయిందని విన్నది. మళ్లీ భక్తవత్సలం లలిత కొంపలోకి జేరినట్లుకూడా విన్నది. 'కాంతం లాంటి స్త్రీ లెంతమంది కూలిపోతున్నారో'నని కాత్యాయని వివాహితల్ని చూచి జాలిపడేది. కాంతం గాధ కాత్యాయనికి మరువని తలపై మసలుతోంది.

—:O:—

# పన్నుల వల్ల కేంద్ర ప్రభుత్వానికి వస్తున్న ఆదాయం



భారత ప్రభుత్వానికి ౧౯౫౫ - ౫౬ వ సంవత్సరంలో పన్నులవల్ల (రాబడి పన్నులోనూ, మరణ సుంకాలలోనూ రాష్ట్రాల వాటాలు పోను) మొత్తం ౪౨౮ కోట్ల రూపాయల ఆదాయంవచ్చింది. ౧౯౫౬ - ౫౭ వ సంవత్సరంలో సవరించబడిన అంచనాల ప్రకారం యీ ఆదాయం ౪౯౫ కోట్ల రూపాయలు. ౧౯౫౭ - ౫౮ వ సంవత్సరపు బడ్జెటులో పన్నులవల్ల కేంద్ర ప్రభుత్వానికి ౫౧౫ కోట్ల రూ. ల రాబడి ఉంటుందని అంచనా వేశారు.

౧౯౫౫ - ౫౬ వ సంవత్సరంలో భారత ప్రభుత్వపు మొత్తం రాబడిలో పన్నుల వల్ల వచ్చిన ఆదాయం నూటికి ౮౬ వంతులూ, ౧౯౪౪ - ౪౫ లో నూటికి ౯౬ వంతులూ, ౪౯౫౦ - ౫౧ లో నూటికి ౮౭ వంతులూ ఉంది.

పన్నుల వల్ల కాకుండా, ఇతరత్రా అంటే రైల్వేలలో తంతి తపాలా శాఖ మొదలైన ప్రభుత్వ శాఖల ద్వారా వచ్చిన ఆదాయం ౧౯౩౮ - ౩౯ లో ౧.౮ కోట్ల రూ. లూ. ౧౯౪౪ - ౪౫ లో ౪౨.౪ కోట్ల రూ.లూ, ౧౯౫౦-౫౧ లో ౨౩ కోట్లు, ౧౯౫౫ - ౫౬ లో ౨౬.౭ కోట్ల రూ.లు.

౧౯౫౫ - ౫౬ లో పన్నులవల్ల వచ్చిన మొత్తం ఆదాయం (౪౨౮ కోట్ల రూ.లు) లో కస్టమ్సు (ఎగుమతి, దిగుమతి) సుంకాల ద్వారా దాదాపు అయిదింట రెండువంతులూ( ౧౬౭ కోట్ల రూ. లు,) ఎక్సైజు సుంకాల ద్వారా మూడింట ఒక వంతూ (౧౪౫ కోట్ల రూ.లు,) రాబడి పన్ను, కార్పొరేషను పన్నుల ద్వారా సుమారు నాలుగింట ఒక వంతు (౧౩౧ కోట్ల రూ. లు) ఆదాయం వచ్చింది. సమిష్టా కాలంలో పైన పేర్కొనిన పన్నుల ద్వారా వచ్చిన ఆదాయం మొత్తం పన్నులద్వారా వచ్చిన ఆదాయంలో నూటికి ౬౬.౪ వంతులు.

౧౯౩౮-౩౬ నుంచి ౧౯౫౭ - ౫౮ వ సంవత్సరం వరకూ (౧౯౪౪-౪౫ వ సంవత్సరం మినహాగా) కస్టమ్స్ సుంకాల ద్వారానే భారత ప్రభుత్వానికి ఎక్కువగా ఆదాయం వస్తోంది.

యూనియన్ ఎక్సైజు సుంకాల ఆదాయంకూడా ఏటేటా పెరుగుతోంది. ఆ ఆదాయం ౧౯౩౮ - ౩౯లో ౯ కోట్ల రూ.లు కాగా ౧౯౪౪ - ౪౫ లో ఆ ఆధాయం ౩౮ కోట్ల రూ.లకూ, ౧౯౫౦-౫౬ లో ౧౪౫ కోట్ల రూ.లకూ పెరిగింది. ఈ ఎక్సైజు సుంకాల వల్ల ౨౦౯ కోట్ల రూ.ల ఆదాయంరాగలదని ౧౯౫౭-౫౮ వ సంవత్సరపు బడ్జెటులో అంచనా వేశారు.

మొత్తం పన్నులవల్ల వచ్చే ఆదాయంలో యిదినూటికి ౮౧ వంతులు.

రాబడి పన్ను (కార్పొరేషను పన్ను కూడా కలుపుకొని) వల్ల వచ్చే ఆదాయం ౧౯౩౮ – ౩౯ నాటి కంటే ఇప్పుడు సుమారు ఏడురెట్లువచ్చింది. ౧౯౩౮-౩౯ లో ఆ ఆదాయం ౧౯ కోట్లు కాగా, ౧౯౫౫ ౫౬ లో అది ౧౧౩ కోట్ల రూ. పెరిగింది. ౧౯౫౭ - ౫౮ లో యీ పన్నువల్ల ౧౩౭ కోట్ల రూ.ల ఆదాయం రాగలదని బడ్జెటు అంచనాలలో పేర్కొన బడింది.

---

ఒకాయన తన చర్మవ్యాధుల స్పెషలిస్టు అయిన స్నేహితుని, వైద్యములో తాను మిగిలినవన్నీ వదిలేసి దానినెందుకు ఎన్నుకున్నావని అడిగాడు.

అతడు అందుకు మూడు కారణములున్నవి - నా దగ్గరకు చికిత్సకువచ్చేవారు అర్ధరాత్రిప్పుడు వచ్చి నిద్రను పాడుచేయరు; వాళ్లు చనిపోయేటంత అపాయకర పరిస్థితి ఏర్పడదు; వాళ్లకు వ్యాధినయంకాదు"

'నారపీచు'

---

# "మాయలోకం!"

శ్రీమతి మునిపల్లె సరస్వతి



(ఒక పల్లెపడుచు తన భర్త వేరొకయువతిని ఆశ్రయింపగా నాయువతి దుఃఖితయై తనకలాంటి దశ సంభవింప నిస్సహాయురాలైన పల్లెపడుచు మరదిని వేడుకొన్నది. అట్లు తోడ్పడనిచో మరణమే మేలని, లోకాన్ని గురించి మరదితో ముచ్చటించినది. పల్లె పడుచుల గుణ విశిష్టత గొప్పది.)

చింత చెట్టూ మీద చిలుకవాలింది,
చిన్నోడి మనసంత చిలుకమీదుంది
మల్లె పందిరిమీద మిడుత వాలింది,
మావోరి మనసంత మిడుతమీదుంది.

సన్న జాజీమీద సూరీఁడు వాలి,
సన్నని కిరణముల సోకనిచ్చేఁడు.
మాయూరి పొలిమేర నేయూరపందో,
మాపిటేలా వచ్చి మసలి పోతోంది.
పసులదోలూవాడ! పిచ్చినామరదీ!
వచ్చి నూరా బంది నోడ గొట్టుమురా
రాత్రి నిద్దుర లేదు కాపాడరోరి!
రాక్షసుఁడు మీఅన్న రారా నామరదీ!
మరది నీవునుగూడ నన్నలాగైతే,
మరణమేనిక్కంబు మరది వినరోరి!
ఒలువైన మెట్టెలు ఝల్లుమనుచుండు,
వెలుపలిచేలోన చితి వేర్చుకుందు.
కలకాలముండురా కడతేర్చుమరదీ!
కలికి మీవదినమ్మ కడసారికోర్కె
కిలకిలా నవ్వేను యీ మాయలోకం.
చురచురా జూచేను యీ గ్రుడ్డిలోకం!



వంటవాడుగా పనిచెయ్యడానికి వచ్చిన వ్యక్తిని ఒక యిల్లాలు "వంటచెయ్యడం బాగా తెలుసంటున్నావు; ఎంతకాలం నుండి"

"చాలకాలంనుండి"

"ఇంతకు ముందు చేస్తున్నచోటును ఎందుకు వదిలేశావు?"

"ఆ యింటి యజమాని, యజమానులు చనిపోయారు"

"ఇద్దరూ ఒకేసారి చనిపోయారా! కారణం?"

"నావంట ... ..."

'అర్జున్'

# తెల్ల రోజా!

| రచయిత్రి : | అనుసరణ : |
| --- | --- |
| ఇన్ గే షోల్ | డాక్టరు వి. ఎన్. శర్మ |

## I

కళ్ళు తెరచి గదిని కలయచూసే సరికి బాగా తెల్లవారింది. మామూలు ప్రకారం జైలు నౌకర్లు ఆరు గంటలు టంగున కొట్టేటప్పటికి కాఫీ పాత్రలని నా దగ్గర వుంచి వెళ్లారు. నా దృష్టి మొదట వీటిమీదికి పోయిందికాదు. సోఫీ గదిలో లేదు. అంటే రాత్రంతా ఆ "వాజూలం" గదిలోనే వుండిపోయిందన్నమాట. వాళ్లమీద చాడీలు చెప్పమని, వీళ్ళమీద చాడీలు చెప్పమని సోఫీని నయాన భయాన అధికారాన్ని చెలాయించి వుండాలి. అ సమయాన వాళ్ళ అన్న హాన్స్ అక్కడే వున్నాడా? వుండి వుంటే చెల్లిపడే బాధను చూస్తూ ఎంత కంగారు పడుత్తూ వుంటాడో పాపం! అధికారులకు కావలసింది వాళ్ల కేసు బలవత్తరంగా వుండటానికి సాక్ష్యం. ఇలాటి సాక్ష్యానికి అందరూ చేదోడు వాదోడుగా వుండాలనే వాళ్ళ పట్టుదల. దాన్నిఎవళ్ళయినా సడలించటానికి ప్రయత్నించారో, వాళ్ళకి గతీ మోక్షాలు అనేవి వుంటాయా మరి? ఈ యాతనలో అ నిర్దోషుల ఆకలి దప్పులని తలిచేవాళ్ళు వుంటారా? సోఫీ ఇలాటి క్లిష్టసమస్యల నెదుర్కొంటూ తికమక పడిపోతూ వుండవచ్చు. ఎంత కాలం ఇలాటి అవస్థల్లో మునుగుతూ తేలుతూ వుండాలో? ఇలా ఆందోళనతో, కంగాతో ఆలోచనా సముద్రంలో తేలుతూవున్న సమయాన గది తలుపు తెరవబడటం, సోఫీ లోపలికివచ్చి తన ప్రక్కదగ్గర నిలుబడటం చూశాక నీరయిపోయాను. అప్పటికి ఎనిమిది గంటలయి వుండవచ్చు. ఆ పిల్ల నిజంగా శాంతమూర్తి అయివుండాలి ఇలాటి అవస్థల్లో కూడా తొణక్కుండా సణక్కుండా ప్రశాంతంగా అక్కడ నిలువబడివుండటానికి కావలసిన స్థైర్యశక్తిని తెచ్చుకోటానికి. నా అయోమయావస్థని అవగాహనం చేసుకునే వుండాలి, సోఫీ నాకేసి మందహాసంచేస్తూ, ఆప్యాయంగా నన్ను పలకరించటానికి. ... ఇద్దరమూ కాఫీని పుచ్చుకున్నాం. అప్పుడు మేము చెప్పుకున్న పిచ్చాపాటీలో రాత్రంతా తనకు నిద్ర అనేదే లేదనీ, వాఙ్మూలానికి కావలసిన తతంగం ఇంకా ముగియ లేదనీ, ఇంకొకసారి అక్కడికి వెళ్ళాలసి వస్తుందనీ సోఫీ అన్నది. ఆ పిల్ల అలసిసొలసి వున్నది. రెండు మూడు గంటలు పడుకోటం అత్యవసరమని, అలా చేస్తేనేగాని ఇలాటి తతంగాల్లో తేలుకోలేదనీ సోఫీతో అన్నాను. ఆతత్క్షణమే విశ్రాంతి తీసుకోమని బ్రతిమాలాను. ... ...

ఆ రోజు శుక్రవారం. ప్రొద్దున అధికారుల దగ్గరనుంచి కబురురాలేదు. మధ్యాహ్నపు భోజనం వరకు సోఫీ హాయిగా పడుకున్నది. భోజనాలయ్యాక సోఫీ తన కథను నాకు మొదటినుంచి చెప్పుకుని వచ్చింది. అది కథా లేక గాథా! అందులో వింటున్న ఘట్టాలని నమ్మాలా? లేక పచ్చి అబద్ధాలని త్రోసివెయ్యాలా? అవి అబద్ధాలని ఎలా అనటానికి సాహసించగలుగుతాను? మా అన్నయ్య ఇలాటి సాహసకార్యాల్లో కలుగజేసుకోనటం తోనేగా, సంవత్సరంపైచిలుకునుంచి జైల్లో నరక బాధలని అనుభవించాలసి వస్తున్నది. నన్నూ అలాటి సంఘటనలేగా ఇక్కడికి తీసుకుని వచ్చాయి. అంచేత మనమంతా నేస్తాలం. ఇలాటి మహోత్తర కార్య భారాన్ని వహించటంలో ఏకోదరులంమల్లె వుండగలిగే బాధ్యం లభించిందని ఆ పిల్ల చెప్పుతూవున్న వీరకధానికని వింటూ మైమరచిపోయాను. ... ...

ఆరోజున తనూ, తన నేస్తాలూకలిసి యూనివర్సిటీ భవనంలో, ఆవరణంలో కరపత్రాలని ఎలా పడ



4

వేళారో సోఫీ వివరంగా చెప్పింది. ఆ పని, ముఖ్యంగా పట్టపగటిలో యథాతథంగా చక్కబెట్టటం సామాన్యమైందికాదు. ఆ పనినే జయప్రదంగా నిర్వహించారు ఆ అమ్మాయీ, వాళ్ల నేస్తాలు, వాళ్ల వాళ్ల పద్ధతుల్లోనే. ఆ పని ముగించుకొని ఇంటికి వెళ్ళబోతూవున్న సమయంలో భవనాన్ని అస్తమానమూ వూడ్చి శుభ్రంచేస్తూవుండే పనిమనిషిని లోపల కారిడోర్‌లో ఎదుర్కొన్నది సోఫీ. ఆ పనిమనిషి కాలాంతకురాలు. అవలిస్తే పేగుల్ని అవలీలగా లెక్కపెట్టేశక్తిసందలుగల గట్టి మనిషి. కాగితాలనివూడ్చి బుట్టలో వేస్తూవుంది. సోఫీ ఆ విడని పలకరిస్తూ "ఎందుకమ్మా! అలా వాటిని బుట్టలోకి దింపటం! అక్కడ్నే కొంతకాలం వుంచి వుంటే, ఈ దోవలో వచ్చేవాళ్లూ, వెళ్ళేవాళ్లూ అనాయాసంగా తీసుకుని చదువుకోటానికి వీలుంటుందిగా" అని అమాయకంగా అనేసింది. ఆ మాట ఎంతపని చేసిందో సోఫీకే తెలిసివుంటే అలా అనటానికి సాహసించివుండేదికాదు. సాహసం అంటే ఆ పిల్లలోనే పుట్టుకనుంచే వున్నదని చెప్పటంలో తప్పేమీలేదు. రాత్రిళ్లు వీధి వీధులకు వెళుతూ గోడలమీద కాగితాలను అంటించటంలోను, ప్రతి ఇంటిలోపలనుండే తపాలా పెట్టిలో కరపత్రాలని చడీచప్పుడులేకుండా వేయటంలోనూ, ఆ పిల్ల అవలంబించిన పద్ధతులని వింటుంటే గుండెలే చప్పున ఎగిరిపోతాయి! ...

శనివారం వచ్చింది వుదయమంతా వాళ్లకు కావలసిన సంజాయిషీని ఆ పిల్ల దగ్గరనుంచి తెలుసుకోటానికి ఆ పిల్లను తికమక పెట్టారు. సాయంకాలమూ, రాత్రీ ఈ తతంగం యథాతథంగా జరిగిపోయింది. ప్రభుత్వంవారు ఇలాటి కేసులను విచారించటానికి ప్రత్యేకంగా నియమించిన జడ్జీలు సోమవారంనాడు హైకోర్టు భవనంలో కూచుంటారని వాళ్లు సోఫీకి ఆ రోజున్నే చెప్పారు. ఈ కబుర్ని చెప్పిన అధికారికూడా కాలాంతకుడు. ఇలాటి అమాయకుల్ని ఈ రోజుల్లో హడలగొట్టటంలో తద్వారా తన దోవలోకి వాళ్ళని చకచక నడిపించటంలో నిగ్గుతేరిననిధి. ఆ పిల్ల చేస్తూవున్నపని దేశాభ్యుదయానికీ, జాత్యభ్యుదయానికీ ఏమాత్రం మంచిది కాదని పెద్ద వుపన్యాసమిచ్చాడు ఆ నాటి తతంగం పూర్తి అవటానికి కొంచెం ముందు. నాజీ వుద్యమం అంటే ఏమిటో ఈ ఉద్యమాన్ని జయప్రదంగా నడపటానికి నాయకుడు చేస్తూవున్న త్యాగము, సాహసం, సేవ మొదలగు వాటిని గురించి గుక్కతిప్పుకోకుండా కుమ్మరించేవాడు. జర్మను సంస్కృతి, పేరు ప్రతిష్ఠలు శాశ్వతంగా నిలుపబెట్టుకోవాలంటే ఈ వుద్యమంపట్ల మనోవాక్కాయలతో భక్తిశ్రద్ధలని చూపాలి. నాయకుడ్ని తమ ఆపద్బాంధవుడని దృఢంగా నమ్మాలి. పెడదోవల్లో వెళుతూవుండే వాళ్లకి ప్రభుత్వం మంచి అవకాశం ఇస్తూవుంది. ఇట్టి అవకాశం ఎప్పుడు రమ్మంటే అప్పుడు వస్తుందా మరి... ఇలాటిదోవలో బోధించటానికి ఈయన ప్రారంభించాడు. దీన్ని ముగించాడో లేదో, సోఫీకేసి సూటిగా చూస్తూ ఇలా అన్నాడు: "ఏం అమ్మాయి! ఇదంతా ముందే తెలిసివుంటే ఇలాటి వంకలదోవల్లో నడుస్తూ తికమకపడుతూవుండక, హిట్లరుని నాయకుడ్నిగా అంగీకరించే వుండేదానివి కదూ? ఆయన చూపెడుతూ వున్నజాడల్లోనే ముందు వెనుకలు చూడకుండానే నడిచి మనజాతి కీర్తి ప్రతిష్ఠలని నిలుపబెట్టి వుండేదానివేగా?" దాంతో వూరకవున్నాడా ఈ పెద్ద మనిషి? ఆ పళాన సోఫీ జవాబియ్యాలని గట్టిపట్టుపట్టాడుకూడా! సోఫీ అతనికన్న ఇలాటి విషయాలని తేల్చటంలో రాటింపుగా చదువుకున్న మనిషే! ఆయన అడిగింది సూటిగా జవాబియ్యమని! సోఫీ అతని ముఖంలోకి సూటిగా చూస్తూ "నేనిచ్చే జవాబు మీ కెంతో అసంతృప్తిగా వుంటుందని నాకు తెలుసు. నా అభిప్రాయం చెప్పమని అడుగుతున్నారు కాబట్టి, చెప్పకుండా వుండటం మర్యాదకాదు. మనదేశ వ్యవహారాలని మీ దృష్టితో చూస్తే, మన భవిష్యత్తుకే ప్రమాదం అని చెప్పటానికి సాహసించినందుకు క్షమించాలి" అని సోఫీ నదురూ బెదురూ లేకుండా చెప్పివేసింది. ... ... దాంతో ఆయన చర్రున మండి

పడుతూ ఇక నీ గదిలోకి వెళ్ళవచ్చునని సోఫీని పంపి వేశాడు.

సోఫీ మా గదిలోకి రావటంతోటే కాఫీని తయారు చేసి ఇచ్చాను. కాఫీతో రుచి చూడటానికి బిస్కట్లు వగైరాలని ఇచ్చాను. అది సామాన్యపు కాఫీపార్టీ అయితేగా! బిస్కట్లు, వెన్న, పళ్ళు, ... ఆ సంగతి తలుస్తూవుంటే ఆశ్చర్యంవేస్తున్నది. వీటి నన్నిటిని ఆ రోజున వాళ్ళే మా గదికి పంపారు. ఇలాటి సరకులనే హాన్స్ గదికి, ఈ కేసుకు సంబంధించిన ఇతర విద్యార్థుల గదుల్లోకీ పంపారని విన్నాను. వీటిని లంచాలు అని అనాలా? లేక మరే పేరుతో పిల్వాలి? ...

ఆదివారం ప్రొద్దున సోఫీ గదిలోపలికి అడుగెట్టే టప్పటికి, కాలోచిత కృత్యాలని తీర్చుకుని కాఫీ పుచ్చుకోటానికి సిద్ధంగా వున్నాను. లోపలికి వచ్చీ రావటంతోనే "కేసుకు సంబంధించిన ముఖ్యమైన వాళ్ళందరినీ పట్టుకున్నారట" అని నా చెవిలో వూదింది. రాత్రంతా నిద్రలేదు. ఇప్పుడు ముగు స్తుంది. అప్పుడు ముగుస్తుంది అని ఆ అమ్మాయిని బూరడిస్తూ ఎన్నెన్నో రహస్యాలని తెలుసుకొన టానికి వాళ్ళు బ్రహ్మప్రయత్నంచేశారు. ఆ అల సటలో, గాబరాలో లోపలినుంచి ఏయే రహ స్యాలు బయలుపడ్డాయో ఆ పిల్లకేం తెలుసు, పాపం? ... కాఫీ పుచ్చుకుని మధ్యాహ్నపు భోజనంవరకు తనివితీరా నిద్రపోయింది. భోజనపు వేళకు నేనే లేపి, కాస్తో, కూస్తో తినమని నిర్బంధపెట్టాను. భోజనా లయ్యాక కబుర్లు చెప్పుకుంటూ గదిలోనే వుండి పోయాం. మూడు గంటలయి వుంటుంది. అధి కారి ఒకాయన తలుపుని అమాంతంగా తెరుచుకుని లోపలికివచ్చి కాగితాలకట్టని సోఫీకి చూపెడుతూ దాన్లో సంతకంచేయమని దీనంగా చూస్తూ అన్నాడు. అవి కేసుకు సంబంధించిన రికార్డులు. సోమవారం విచారణ ప్రారంభమవుతుందని, ఫలాని ఫలానివాళ్ళు జడ్జీలుగా ఆ కేసుని విచారించటానికి కూర్చుంటారని అందులోవుంది. సోఫీ సంతకంచేసి, ఆయనచేతికిచ్చి పంపాక ఒక గట్టి నిట్టూర్పు విడుస్తూ "ఇంక ఈ యమయాతనంతా ముగిసినట్లే" అని మెల్లగా అంది.

చలిరోజులయినా ఎండ కాస్తున్నది. మా జైలు పూరిమధ్యలోనే వుండటం మూలాన బయట వీధుల్లో జరుగుతూవున్న అలజడి మాకు బాగానే వినబడు తూనేవుంది. కార్లు అటూ ఇటూ దూసుకొనిపోతూ వున్నాయి. జనం విధివిరామంలేకుండా సందడి చేస్తూ ఆనందిస్తూవుంది. వాళ్ళకే జైలులోపల జరుగుతూ వున్న రాక్షస కృత్యాలని కాస్తో కూస్తో తెలుసుకో టానికి అదృష్టంవుంటే వాళ్ళ వాలకం మరో విధంగా వుండేదని కాఫీని పుచ్చుకుంటూ, ఆ రణగుణ ధ్వనిని వింటూ సోఫీతో అన్నాను. ఆ పిల్ల ఏదో తీవ్రంగా ఆలోచిస్తూ వున్నట్లు కొంచెంసేపు, వూరకుండి, "నా విషయంలో అంత గాభరాపడటం అనవసరం ... నా కన్నా ఎక్కువ త్యాగంచేసి ప్రాణాలని కోల్పోయినవాళ్లు లక్షలమంది వున్నారు యువకు ల్లోనే. ఈ త్యాగం వృధాపోతుందా మరి? నేను పోతే, నా స్థలాన్ని ఆక్రమించుకుని, ధర్మయుద్ధ పతాకాన్ని ఎగరవేయటానికి మరొకరు తయారవు తారు ..." బొటబొట కారుతూవున్న ఆనంద బాష్పాలని తుడుచుకుంటూ అన్నది సోఫీ. ఆ పిల్లది మొండిపట్టు. దాన్ని ప్రతిఘటించటానికి ఎవళ్ళతర మవుతుంది? ఆ రోజున పరుండటానికి ప్రక్కలని వేసుకొనేసరికి రాత్రి పదిగంటలకు పైగానే అయింది. అప్పుడు సోఫీ వాళ్ళ ఇంటిసంగతులని చెప్పుతూ నన్ను వాళ్ళ ప్రపంచంలోకే అమాంతంగా లాగుకొని పోయింది. అమ్మా, నాన్నా ఈ కష్టాలని ఎలా ఎదుర్కొగలుగుతున్నారో? ఇద్దరు బిడ్డలని ఇక్కడ త్యాగంచేయబోతూవున్నారు. ఇంకో అబ్బాయి యుద్ధరంగంలో యాతనల పడుతూ వున్నాడు. "నాన్నది, అమ్మది నిబ్బరపు మనస్సు." అని నాన్న అమ్మలని తలుచుకుంటూ కళ్ళ నీరు కార్చింది. ...

సోమవారం రానే వచ్చింది. కళ్ళు తెరిచిందో లేదో సోఫీ నన్ను ఆదుర్దాతో లేపింది. రాత్రి తను కన్న పీడకలలని నాకు చెప్పుతుంటూ ఆ గాబరాని

మరచిపోడానికి శాయశక్తులా ప్రయత్నించింది. విచారణ ఏపంథాలో సాగుతుందో, జడ్జిమెంటూ ఏరూపాన వుంటుందో ఆ పిల్లకలల్లోకూడా అనేక దృశ్యాల్లో చూసే వుండాలి. ఇంక కొద్ది నిమిషాల్లో వాళ్లువచ్చి సోఫీని తీసుకుని వెళుతారు. ఆ పిల్లకు ఇయ్యాలసిన ధైర్యాన్ని ఇయ్యటానికి ప్రయత్నించాను. జైల్లోనుంచి బయటపడ్డాక, వాళ్ల అమ్మా, నాన్నలని కలుసుకొనే భాగ్యం లభిస్తే, వాళ్లకు అన్ని సంగతులని నివేదిస్తానని సోఫీకి వాగ్దానం చేశాను. ...

తొమ్మిదిగంటలయ్యేసరికి ఇద్దరు పోలీసు అధికారులు లోపలికివచ్చి సోఫీని, ఆ పిల్లకోసం ప్రత్యేకంగా తెచ్చిన కారులో హైకోర్టుకు తీసుకుని వెళ్లారు. సోఫీ అన్న హాన్సు, వాళ్ళ స్నేహితులూ కోర్టుకు తీసుకునిరాబడ్డారు. విచారణ పూర్తి అవటానికి ఎక్కువకాలం పట్టిందికాదు. జడ్జిమెంటుని అప్పుడే చెప్పివేశారు. ... ...

సాయంకాలం నాలుగుగంటలయి వుంటుంది. నాకు బాగా తెలిసిన ... ... గారు తలుపుని బారున తెరుస్తూ లోపలికి వచ్చాడు. ఆయన మొఖం తెల్లబోయివున్నది. నన్ను చూస్తూ బొటబొట నీరు కార్చాడు. దాంతో కోర్టులో జరిగిపోయిన తతంగం ఏరూపాన్ని దాల్చిందో చప్పున అర్థంచేసుకుంటూ "వాళ్ళంతా చావాలసిందేనా? సోఫీ జడ్జిమెంటు విన్నాక ఎలాగువుంది?" అని ఆతృతతో ప్రశ్నించాను. "ఆ పిల్లకు వున్నంత గుండె నిబ్బరం మరెవ్వళ్ళకి వుంటుంది?" అని గద్గద స్వరంతో ఆయన అన్నాడు.

"శిక్షని తగ్గించమనీ కోరుకోటానికి అవకాశమనేది ఏదైనవుందా?" అని గడగడ వణకిపోతూ మెల్లగా అన్నాను.

ఆయన ఆ మాటకి వెలవెలబోతూ, భూమికేసి ఆ పళాన చూస్తూ, పెదవిని విరుస్తూ "ఇంకో గంటన్నరలో ... ... అంతవరకు ఆ పిల్లని తలుస్తూ వుండాలి. అంతకంటే మనం ఏంచేయగలుగుతాం?" అతి శాంతంగా అన్నాడు. ... ...

కాలం గబగబ దొర్లుకునిపోతూవుంది. నాపై దృష్టిఅంతా ఎదురుగావున్న గడియారంమీదే! లోపల గుండె తరుక్కునిపోతూవున్నది. నా అయోమయావస్థని ఎలా చెప్పగలుగుతాను? ... ...

అయిదు గంటలు టంగున కొట్టింది ... అయిదుంబావు ... అయిదూ ఇరవై ... ... "

♦ ♦ ♦

II

ఆ రోజుల్లో హెల్ మూట్ ... అనే ఆయన్ని జైల్లోకి తెచ్చారు. హెల్ మూట్, వయస్సులో హాన్సకన్నా అంత పెద్దవాడుకాదు. అమాయకుడు. చనివిచ్చి అందరితో, మాట్లాడే స్వభావంకలవాడు. తన నేస్తాలతో రాజకీయ విషయాలను గురించి చర్చిస్తూవున్న సమయాన హిట్లరును గురించి రెండు మూడు కటువు మాటలు అన్నాడు. మరో క్షణాన పోలీసులు ఆదరా బాదరావచ్చి భేడీలువేసి జైలుకు తీసుకునివచ్చారు. అతను చేసిన అపరాధం పోలీసువాళ్ల దృష్టిలో అంత పెద్దదికాదు. అయినా అలాటి మనుషులకు బుద్ధి చెప్పటం అవసరం. ఆ అవసరం తీర్చటానికే కాన్ సెన్ట్రేషన్ క్యాంపులను కట్టారు. అలాటి క్యాంపుల్లో కొంతకాలం యాతనలనిపడుతూ వుండాలని వచ్చింది. ఇప్పుడా హెల్ మూట్ ని మూన్ చన్ కారాగారంలోకి మార్చారు. అతను వుంటున్న గదిలోకే హాన్స్ ని తీసుకుని వచ్చారు. అంచేత వాళ్ళిద్దరికీ పరిచయంగలిగింది. హెల్ మూట్ ... హాన్స్ ని తను ఎలా కలుసుకున్నదీ, ఆ రోజుల్లో తనకు హాన్స్ చెప్పిన సంగతులు వగైరాలని జయిల్ నుంచి బయట పడ్డాక మా ఇంటికి వచ్చి మమ్మల్ని కలుసుకుని ఇల్లా చెప్పాడు.

"హాన్స్ ని ఏకాంతంగా వుంచటం జైలు అధికార్లకు సుతరామూ ఇష్టంలేదు. ఆత్మహత్య చేసుకుంటే చేసుకోవచ్చు. లేకపోతే వాళ్ళకళ్ళలో ఇసక

పోసి తప్పించుకుని వెళ్ళినా వెళ్ళవచ్చు. ఇదే వాళ్ళ భయం. అంచేతనే హాన్సుని నా గదిలోకి తెచ్చారు. హాన్స్‌ని చూసేటప్పటికి హడలిపోయాను. కేసుకు సంబంధించిన భోగట్టాను సేకరించటానికి అధికారులు ఎన్నెన్నో యాతనలని పెట్టి వుండాలి. వాటి కన్నిటికీ ఓర్చుకోటానికి ఎంత ధైర్యం, సాహసంచూపి వుండాలి. ఇలాటి వ్యక్తులనిచూస్తే పోలీసులకు చెప్పరానంత చిరాకు. భయంకూడా! శస్త్రచికిత్సకుమల్లె నదురూ బెదురూలేకుండ హాన్స్‌కి ఆత్మ చికిత్సకు సంబంధించిన తతంగాన్నంతా తూ.చా. తప్పకుండా చేసివుండాలి. ... ...

గదిలోకి వచ్చాడన్నమాటేగాని, శరీరకంగా హాన్సు అస్తమానమూ బాధపడుతూ వుండేవాడు. రాత్రిళ్లు కన్నుమూస్తేనా? బయటవున్నవాళ్ళను గురించే సర్వావస్థల్లో తలుస్తూవుండేవాడు. పొరబాటున వాళ్ళపేర్లు నోటినుంచి వచ్చాయా? ... ఆ పనికోసమేగా పోలీసులు అస్తమానమూ అతన్ని పెడుతూ వున్న బాధలు. ... ... "ఈ దేహంలో ప్రాణం వున్నంతవరకు, వాళ్లు ఎన్ని బాధలు పెట్టినా సరే, వాటిని ఓర్చుకుంటానుగాని, నా స్నేహితుల పేర్లను ససేమిరా చెప్పను" అని నాతో హాన్స్ అన్నాడు వచ్చిన రోజున్నే ఇద్దరమూ కలిసీ మాటా మంతీ చెబుకుంటూవున్న సమయంలో. నిద్రాహారాలు లేక, తన నేస్తాలను గురించి ఆలోచిస్తూవున్నా, ఎప్పుడూ మందహాసంచేస్తూ వుండటం హాన్స్ స్వభావం. "మంచి రోజులు తప్పక వస్తాయి. అవి రావాలనేగా మేమందరమూ దోవను చక్కచెయ్యటం" అని అంటూ వుండేవాడు. తనకు నచ్చిన పాటల్ని పాడుతూ, పద్యాలని గానంచేస్తూ, పెను భూతాలకుమల్లె తనని ఎదుర్కొంటూన్న కష్టాల సంగతే ఆ అమృతగానంలో మరచిపోతూ వుండేవాడు. ... ...

ఆ రోజున పడకనుంచి లేచాడోలేదో, హాన్స్ ఒక పద్యాన్ని రాగయుక్తంగా ఒప్పచెప్పటానికి ప్రారంభిస్తు

"సూర్యుని వేడిని ఎలా భరించటం?" చప్పన అని గావుకేకేశారు...అడ్డువచ్చి "అలా అంటా వెందుకు హాన్స్? ఇదివసంత కాలంకదూ! సూర్యరశ్మి కావాలని వాంఛిస్తున్నాము. అలాటప్పుడు సూర్యుని వేడిని ఎలా భరించటం అని పాడటం సబబుగా వుంటుందా?" అని ప్రశ్నించాను. హాన్స్‌కి కావాలసింది ఇలాటి ప్రశ్నలే! నాకేసి ఎగాదిగాచూస్తూ మందహాసం చేస్తూ "నువ్వు అనేది నిజమేనోయ్! కాని వుత్త సూర్యరశ్మితో తృప్తిపడితే మన గమ్యస్థానం ఎలా చేరగలుగుతాం? ఎండ బాగా కాయాలి. మనల్ని మాడేటట్లుచేయాలి ఆ ఎండ. అప్పుడే మనలోని శక్తితేజాలు బయటికి రాగలుగుతాయి!" అంటూ కిటికీ దగ్గరకివచ్చి నిలుచున్నాడు. సూర్యకిరణాలు కిటికీలోనుంచి గదిలోకి ప్రవేశిస్తూవున్నాయి. హాన్స్ దేహాన్ని ఆవరించాయి వాటి లోకానికే అతన్ని ఆహ్వానిస్తూ వున్నట్లు, అతనికి ఇయ్యాలసిన వుత్సాహాన్ని నదురూ బెదురూలేకుండా ఇస్తూవున్నాయి. ఆ దృశ్యాన్ని కళ్లారచూసే తీరాలి! ఆ ఆనందమయంలో హాన్స్ తను అక్కడ, జైల్లో, ఒక చిన్న గదిలో, వున్నాడన్న సంగతే పూర్తిగా మరచిపోయాడు. హాన్స్ ఎదుర్కొనబోయేది చావుని. పాడు చావుని. వురిస్తంభంమీద! అయినా ఆ గుండె నిబ్బరాన్ని చూస్తుంటే నాకే ఆశ్చర్యంవేసింది. నా కష్టాలన్నీ ఆ ఆనందమయంలో మరచిపోయానని చెప్పటంలో అంతేమీలేదు.........

(తరువాత ఏం జరుగుతుందో ముందు సంచికలో చదువుతారు)

# నాగార్జునుడు

శ్రీ కడెము వేంకటసుబ్బారావు

ఆంధ్రి కడుపు పండినది, నాగార్జునుండు
శైశవావస్థయందె సంస్కారవశత
సర్వ శాస్త్రరహస్యార్థ చర్వణుఁడయి
భౌతిక జగత్తు విలువను వ్యాఖ్యచేసె.

అర్జున శీలుఁడై ప్రగతి కందము దిద్దినయట్టి - ఆర్యనా
గార్జునుఁడాంధ్రుఁడై జనన మందుట ఆంధ్రి తపఃఫలంబెకా.
అర్జున వృక్షమూలమున అద్భుతసిద్ధులు సంగ్రహించి - అ
త్యూర్జిత ప్రేమతో జనులకుత్సవ దర్శనుఁడయ్యె నాఁడహా

సిద్ధ నాగార్జునాచార్య శ్రీపదాంక
భద్రముద్రిత మీ ప్రాచ్య భావజగతి
ప్రాచ్యమానవ జీవనాళములయందు
బౌద్ధ ధర్మాభిరతి పొంగు వాఱుచుండు.

విశ్వమానవ సోదర ప్రేమలోనె
విశ్వజీవ సౌభ్రాత్రంబు విపులపఱచి
విశ్వకళ్యాణ గీతి విన్పించినాఁడు
సరస మంజులభణితి నాచార్యుఁడపుడు

సిద్ధాంతామృత సారమంతయును రాశీభూత కారుణ్యమై
బౌద్ధాచార్యుఁడు తానయయ్యె - మఱి సౌభ్రాత్రంబు సౌశీల్యమ
త్యౌద్ధత్యంబు వహింప మాధ్యమిక వాద ప్రౌఢితోఁ దత్త్వ సం
పద్ధర్మంబులఁ జర్చ చేసె - అది అద్వైతోక్తి మూలంబుగా

భాషలందు యోగమునందు వైద్యమందు
బహుముఖ ప్రజ్ఞలను గన్న బౌద్ధగురువు
స్వీయ పారావత విహార సీమలందు
విశ్వ విద్యాలయము నడిపించినాఁడు.

---




# చెరపకురా - చెడేవు

శ్రీ బొడ్డుపల్లి కృష్ణావధాని

అనగా అనగా ఒక సరస్సు ఒడ్డున ఒక నక్క నివసించుచుండెను. ఆ నక్క ఒక రోజున ఆవలి ఒడ్డునగల ఒక కళేబరమును చూచి దానిని తినవలెనని ఆశగలిగి కాలను దాటుటకొక ఉపాయమును యోచించెను.

ఆ ప్రాంతముననే తిరుగాడుచున్న ఒక ఒంటె దగ్గరకు వెళ్ళి "మిత్రమా! ఈ కాలను ఆవలిఒడ్డున ఒక మంచి చెరకుతోటకలదు. మన మిరువురము పోయి భుజింతము రమ్ము" అనెను.

అంత ఆ ఒంటె ఈ జిత్తులమారి నక్క మాటలు నమ్మి మూపున నక్కను ఎక్కించుకుని ఆ కాలను దాటించెను. ఇరువురు చెరకుతోటలోనబడి భుజింప సాగిరి. నక్క కళేబరమునుగూడ భుజించి ఒంటెను ఏడ్పించదలచి ఆ తోట చుట్టును తిరుగుచు అరువ సాగెను. ఆ అరుపులకు ఆ చుట్టు ప్రక్కలనే ఉన్న రైతులువచ్చి తోటలో నెమ్మదిగా తినుచున్న ఒంటెను చచ్చేటట్లు చావగొట్టిరి. అది అరచుచు కాలనువరకు పరుగిడివచ్చెను. అంత ఆ చెంతనే పొంచివున్న నక్క ఎగిరి ఒక్క దూకున నీటిలో ఉన్న ఒంటె మూపున నెక్కెను. సరస్సుకు సరిగా మధ్యకురానిచ్చి ఒంటె నక్కకు బుద్ధిచెప్పదలచి ఇట్లనెను. "మిత్రమా! నేను ఇంకను భుజించుచుండగనే అట్లరచితి వేమి, నీ వరచుటవలన వారు నన్ను చావచితుకగొట్టిరి."

అంత నా నక్క "మిత్రమా! నిన్ను గొట్టింప నేనరువలేదు. నాకు తృప్తిగా భోజనము దొరకిన అలా అరచుట అలవాటు. అందుల కరచితినిగాని నిన్ను కొట్టింప అరువలేదు" అనగానే ఒంటెకు ఒళ్ళుమండి నక్కతో ఇట్లనెను.

"నక్కగారూ! నాకుగూడ తృప్తితీరునట్లు భుజించిన తదుపరి, బాగా దెబ్బలుతిన్న తరువాత నదిలో స్నానమాడుట సరదా" అనుచూ ఒక్క మునుగు మునిగెను. నక్క గిలగిల కొట్టుకొని చచ్చెను.

చూచితిరా! బాలలూ! నక్క ఒంటెను చెరుప ప్రయత్నించి తనే చెడింది. కనుక మనముగూడ ఒకరికి హాని చేయ ప్రయత్నించిన మనమే చెడుదుము.

---

# మహాధనం

శ్రీ మంద రామారావు

ఆటలు పాటలు నేర్చే
బాల బాలికలార
ఆటకు పోతున్నారా!
హాయిగ వెళ్తున్నారా! —

వెళ్ళండీ! వెళ్ళండీ!
అలసేలా ఆడండీ
తెచ్చుకోండి ఉత్సాహం
వీడకండి ఐకమత్యం —

పెందలాడె భోంచేసి
పాతపాఠాల్ చదువుకోండి
తెలియని పాఠాలన్నీ
తలిదండ్రుల నడగండి —

దైవాన్ని తలచుకొని
వేవేగం పడుకోండి
వేకువనే లేవండి
బాగుగా చదువుకోండి—

మితిమీరి భోజనం
అతిగా మాట్లాడటం
సతతము నిద్రించటం
సత్ఫలిత మీయవునుడీ—

రాబోయే కాలంలో
మా రాలి మీరంతా
సత్ పురుషులుగా దేశం
సంరక్షణ చేయాలి —

అందుకు మీకవుసరం
అన్నిటికీ ఆధారం
మానవులకు మూలమైంది
'మహాధనం' ఆరోగ్యం —

---

## "అంజలి"

"రాజశ్రీ"

(భారతీయ సాహితీ పరింపరలను — విశ్వ వీధుల్లో విజృంభింప చేసిన — విద్వత్కవి...
తెలుగుల కోడలు — 'సరోజిని' ని గూర్చి)

భరత జాతీయ సత్కళా ప్రాభవముల
సాటి దేశాలఖండాల చాటుకొన్న
మేటి ముద్దుల భావాల మూటవమ్మ-
నోరు మెదిపిన ముత్యాలు జారునమ్మ ...

మధుర మధురాల భావాల మాటులోన
సరస వాఙ్మయ సీమల చాటులోన
హృదయ సీమలు పులకించు మృదులమై
నీదు కవితలె మాకు పన్నీటిజల్లు ....

పశ్చిమాభ్యుదయాలలో పరువులెత్తి
అతిమనోహర శైలిలో 'ఆంగ్లమందు'
కవిత లల్లిన సాహిత్య కల్ప వల్లి
లలిత మాధుర్య కవితా కళాతపస్వి ...

పాంచభౌతిక దేహమ్ము బాసెగాని ;
తల్లి! మా హృదయాలలో తాండవించు;
ఓ! సరోజిని! నీ మూర్తి బాసి పోదు
మధుర కవితాలలామా! నమస్సులమ్మ....

# వాళ్లనలా వదిలేద్దాం

శ్రీ సేమాని సంగమేశ్వరరావు

(గతసంచిక తరువాయి)

7

దమయంతితో వివాహమయిన కొన్ని మాసాల అనంతరం తన ప్రవర్తనను, ధర్మామీటరుతో జ్వరం కొలిచి చూసుకున్నట్టు చూసుకున్నాడు ప్రభాకరరావు.

దమయంతి ప్రేమముందు, యీ కృత్రిమ ప్రేమలన్నీ దిగదుడుపుగా కనిపించసాగేయ్!

ఎలా అయినా వజ్రము వజ్రమే! గాజు ముక్క గాజుముక్కే!

అయితే ఇదివరకు దేనిగురించి ఆలోచించి ఎరుగని ప్రభాకరం ఇప్పుడు తన ప్రవర్తనగూర్చి తీవ్రంగా ఆలోచించసాగేడు.

ఏదో రెండు మూడు బులిబూచికం కబుర్లుచెప్పి తను దమయంతిని మోసపుచ్చగలడు! కాని ఎప్పుడూ ఎదురు తిరుగని మనస్సు ఇప్పుడెందుకో ఎదురుతిరుగుతున్నాది. అతనికి ఈ తుచ్ఛ సుఖాల మీద ఏవగింపుకలగడం అతని జీవితంలో ఒక క్రొత్త అధ్యాయం తెరచినట్టయింది!

మొట్టమొదట దమయంతిని చూసిన నాడే తాను మామూలుగా ఆమెను తన జీవితంలో భాగస్వామిని చేసుకుందామనుకున్నాడు. అది నిశ్చయంగా కటిక సత్యం అవుతుందని అతడు కలలోకూడా అనుకోలేదు!

ప్రభాకరం తన ప్రవర్తన మార్చుకునేందుకు ప్రయత్నాలు చేయసాగేడు!

రాత్రి పదిగంటలకు ఇల్లుచేరిన ప్రభాకరరావుకి ఎదురుగా వచ్చింది దమయంతి. అతను గదిలోకివచ్చి కుర్చీలో కూర్చున్నాడు. దమయంతి క్రింద కూర్చొని బూటులేసులు విప్పసాగింది. ఎవ్వరూ మాట్లాడలేదు. నిశ్శబ్దముగా వున్నారు.

ఎలక్ట్రిక్ కాంతిలో ఆమె ముఖం చూసేడు ప్రభాకరరావు!

కళాకాంతులులేకుండా వాడి కళావిహీనమయి ముప్ఫయి జాగారాలుచేసిన ముఖంలాగువుంది!

"నువ్వు ఏవైన టానిక్కులు తీసుకుంటే బాగుంటుంది" అన్నాడు అకస్మాత్తుగా

"నా కెందుకండీ టానిక్కులు!" అంది పేలవంగా చిరునవ్వు నవ్వుతూ!

అందులో ముత్యాలు రత్నాలు రాల లేదు.

"ఇటు చూడు! ..."

చూసింది——

బూటు విప్పడం అయింది. తీసి ఒక మూల పెట్టివచ్చింది.

ప్రభాకరరావు కుర్చీలోంచి లేచేడు.

'ఇలారా!" అన్నాడు.

దగ్గరగావచ్చింది.

తనులేచి ఆమె నడుంచుట్టూ చేతులు వేసేడు. ఆమె అభ్యంతరమేమీ చెప్ప లేదు. అలా చేతులువేసి ఆమెను నిలువు టద్దం దగ్గరకు తీసికెళ్లేడు.

మంత్ర ముగ్ధలాగు అతన్ని అనుస రించింది!

అద్దంలో యిద్దరూ ప్రతిబింబిస్తున్నారు.

ప్రభాకరం ఇలా అన్నాడు ఆమె గడ్డాన్ని పట్టుకొని తన పక్కకి తిప్పు కుంటూ.

"చూడు!...నీ కళ్లు ఎలా వున్నాయో ... నీ ముఖం ఎంతకాంతి విహీనంగా వుందో..." ఆ మాటల్లో కరుణకనిపిస్తు న్నాది.

"నాకేమండీ! ఆనందముగా నే వున్నాను..." అంది. కాని అవి కల్పన మాటలని తెలిసిపోతున్నాయి.

"నీ కెందుకు ఈ విచారమో నాకు అర్థం కావడంలేదు. నీకు చింతాలేకుండా నిర్విచారంగా, ఆనందంగా జీవించవల సింది, మనోవ్యథతో కృంగిపోతున్నావ్! నీ ఈ మనస్థత్వంతో నువ్వు నీ జీవితంలో ఒక నిర్ణయానికి ఎప్పుడూ రాలేవ్ ... ముందుగానే తెములుకుంటే మంచిది. లేకపోతే ఇంకే రోగంలోకయినా దింపుతే చికాకు" ... ఆగేడు. ఇద్దరూ అలాగే నిలబడ్డారు. అద్దంలో యిద్దరి ప్రతిబింబాలు కనిపిస్తున్నాయి!

మళ్లా యిలా చెప్పడం మొదలు పెట్టేడు.

"......ఒక్క సంగతి మాత్రం నీకు ఇవాళ చెపుతున్నాను. నాకు తెలుసు ఇది నీమనస్సు గాయపరుస్తుందని-అయినా చెప్పక తప్పదు. చెప్పవలసిన సమయం వచ్చింది .... నేను మేడిపండువంటివాడిని! పైకి ఎంత మంచిగా, ఎంత ఉన్నతంగా కనిపిస్తానో, నాలో ఆ గుణాలకి వ్యతిరేక గుణాలు చాలా వున్నాయి! నిజంగా నన్ను చూసి నువ్వు మోసపోయేవు! నీది ఏలాంటి వింతమనస్తత్వమో, నాదీ అలాంటి విపరీత స్వభావమే! అయితే నాకు తెలుసు నాలో కొన్ని దుర్గుణాలు వున్నాయని! ఏదీ

చూపించు! ప్రపంచములో దుర్గుణాలులేని వాడిని! ప్రతీ వాడి జీవితం మంచి చెడ్డల మిశ్రమమే! నేను నిన్ను ప్రేమించలేదు అని అనుకుంటే అంతకంటె పెద్దపొరపాటు మరోటిలేదు. నువ్వునన్ను ప్రేమిస్తున్నావో, లేదో నాకు అనవసరం! ప్రేమిస్తే సంతోషిస్తాను...అయితే నాకు ఒక గట్టినమ్మకముంది! నేను ఎప్పటికయినా మారగలను అని – ప్రతివారిలోను మార్పు తెచ్చేది కాలపరిణామమే! నీకు కొంత ఓర్పు వుండాలి! ఓర్పు లేకపోతే మనం ఏ పనీ చెయ్యలేము ...''ఆగేడు. అతని చేతులు దమయంతి నడుంచుట్టూనే వున్నాయి.

అలాగే తీసుకొచ్చి మంచం మీద కూర్చోపెట్టేడు. తనూ ఆమె ప్రక్కనే కూర్చున్నాడు.

ఎలక్ట్రిక్ కాంతిలో ఆమె ముఖంతళతళ మెరుస్తున్నాది!

''ఈ వ్యక్తిలో ఇంత మంచికూడా వుందా? ఇంత అత్యున్నత భావాలుకూడా వున్నాయా?'' ఈ నాడు ఈ సంగతి దమయంతి తెలుసుకోగలిగింది. ఇంకా ఏంచెపుతాడో అని నిశ్శబ్దముగా విన సాగింది.

ప్రభాకరం సిగిరెట్టు ముట్టించి ఇలా చెప్పడం ప్రారంభించేడు.

''...మానవుడు తన చుట్టూ వున్న వాతావరణానికి అలవాట్లకి బానిస అన్న సంగతి నీకు తెలిసేవుంటుంది! వల్ల

మందు అలవాటు గల వ్యక్తిని అడుగుతే దానిని వదలుకోడంలోగల కష్టం చెపు

---

## "భారత దేశానికి సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు అవసరం"



ఆర్థిక కారణాలవల్లనైతేనేం. సాంఘిక కారణాలవల్లనేం, భారత దేశానికి సహకార వ్యవసాయ క్షేత్రాలు వుండడము ఎంతో అవసరమని నిరుడు జూలైనుంచి సెప్టెంబరువరకూ చైనాలో పర్యటించిన భారత ప్రతినిధి వర్గం అభిప్రాయపడింది.' చైనాలో సహకార వ్యవసాయ క్షేత్రాల నిర్వహణను పరిశీలించి వచ్చిన యీ ప్రతినిధి వర్గం ప్రణాళికా సమితికి సమర్పించిన నివేదిక యిప్పుడు విడుదల చేయబడింది.

"మేలిరకం వ్యవసాయ పద్ధతులనవలంబించి తీవ్రతరంగా సాగుచేస్తూ ఉత్పత్తిని పెంపొందించేందుకు సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు ఎంతైనా దోహదం చేస్తాయి. ఇందువల్ల ఉపాధి సౌకర్యాలు విస్తృతమై, ఉన్నత జీవన వ్యయ ప్రమాణాలను పొందేందుకు కూడా అవకాశం కలుగుతుంది." అని యీ నివేదిక పేర్కొన్నది.

౫౦ గ్రామాలకు ఒక్కొక్కటి చొప్పున వచ్చే నాలుగేళ్లలోనూ, సుమారు పదివేల వ్యవసాయ సంఘాలను నెలకొల్పాలని కూడా యీ ప్రతినిధి వర్గం సిఫార్సు చేసింది. ఈ నాలుగేళ్లలోనూ, ప్రజలు తగినంతగా అనుభవం సంపాదిస్తారు కాబట్టి ఆ తరువాత దేశ వ్యాప్తంగా వీటిని విస్తృతం చేయాలని యీ సంఘం సూచించింది.

---

తాడు! మనం బయటనుండి చెప్పెయ్య వచ్చు" బస్ ... ఆ మాత్రం వదలలేవా అని ...

అందుకే ఎందులోనయినా దిగుతేగాని లోతు తెలియదంటారు ... నువ్వెందుకు వృథాగా మానసిక వ్యధలతో, మనో వ్యాధితో కృంగిపోతావ్! ఈ విచార మంతా నాగురించే అని నాకు తెలుసు! .... నేను నీకు హామీయిస్తున్నాను ... సాధ్యమయినంత త్వరలోనే మారడానికి ప్రయత్నిస్తాను ... లే! ... ఇంక ఈ విచారము మానేసి హాయిగా వుండు! .... ఇవాళనుండి మనం నవజీవనంలో ప్రవేసిద్దాం!"

ప్రభాకరం మాటలు ఆపేడు. అతని ముఖం పరీక్షించి చూసింది. అతని ముఖంలో ఉద్రేకంగాని, తదితర భావాలు గాని ఏమీలేక సహజంగా మాట్లాడినట్టు వుంది.

ఇద్దరూ లేచేరు. భోజనాలకు కూర్చు న్నారు. రాత్రి 11½ గంటలు కావడం వల్ల వంటలక్క వెళ్లిపోయింది. దమయంతే యిద్దరికీ వడ్డనచేసింది. రెండో ప్లేటుతీసేసి దమయంతినీ అందులోనేకూర్చోమన్నాడు! సిగ్గుపడి సంకోచించింది. బలవంతంగా కూర్చోపెట్టుకున్నాడు. అన్నంకలిపి తన నోటికి అందించేడు. ఇద్దరూ ఆనందముగా అందులోనే భోంచేస్తున్నారు.

. తను దేవలోకములో విహరిస్తునట్టు భావించింది దమయంతి. మంచినీళ్లు తను తాగి దమయంతికికూడా పట్టేడు. పసి పిల్లకు తినిపిస్తునట్టుగా తినిపిస్తున్నాడు.

. తను పసి పిల్లగా మారిపోతే ఎంత బాగుంటుంది అని అనుకుంది దమయంతి.

ఇటువంటి వున్నత, ఉత్తమ భావాలు కలవ్యక్తినా తను ఇంతవరకు నిరసించింది! చీ! తన తెలివితక్కువకు తనే విచారిం చింది.

అవును! అతను చెప్పింది నిజమే!! లోకంలో ఒక్క మంచిగుణాలే కలవారు ఎక్కడయినా ఉంటారా? లోకం అంతా మంచి చెడ్డల మిశ్రమమే. అంతవఱకు ఎందుకు — తనలో చెడ్డలేదూ? అయితే ఒక్కనాడయినా వేలెత్తి చూపించేడూ?

ఇద్దరూ లేచి చేతులు కడుక్కున్నారు టవలుతో దమయంతి మూతి చేతులు తుడిచేడు. ఈనాటికి ఆమె కిలకిల నవ్వింది! ఆ నవ్వులో జలజలమని రత్నాలు రాలేయి! ప్రేమతో ఆమెను హృదయా నికి హత్తుకున్నాడు. ఇంత ఆనందము దమయంతి ఎప్పుడూ పొందలేదు!

దమయంతికి తనజీవిత పుస్తకంలో ఒక క్రొత్త ప్రకరణము తెఱచినట్టయింది. తను ఆనంద తరంగ డోలికలలో ఉయ్యాల లూగుతున్నట్లు భావించింది.

''ఆకులియ్యి! ఏంటాలోచిస్తున్నావ్''! అన్నాడు ప్రభాకరం నవ్వుతూ.

అప్పుడుగాని జ్ఞాపకంరాలేదు దమయంతికి తను ఆకులివ్వడం మరచిందన్న సంగతి.

ఇద్దరూ మంచము మీాద కూర్చున్నారు. ఆమె వక్కలు యిచ్చింది. అతడు వక్కలు వేసుకొని ఆమెతొడమీాద తల పెట్టుకొని పడుకున్నాడు. దమయంతి తమలపాకులు యీానెలు తీసి యిస్తూవుంటే అతడు వేసుకుంటూ వున్నాడు....

ఇంక వాళ్లనలా వదిలేద్దాం!



# పెన్సిలిన్ కంటె మంచి మందు

—o—

పెన్సిలిన్ వల్ల లక్షలాది ప్రజలు వ్యాధులనుండి కోలుకుంటున్నారు. కాని పెన్సిలిన్ తన ఔషధలక్షణాన్ని త్వరగా పోగొట్టుకుంటుంది, కాబట్టే దానిని ప్రతి 3–6 గంటల కొకసారి శరీరంలోకి ఎక్కించాలి. అందువల్ల పెన్సిలిన్‌కు బదులుగా వుపయోగపడే మరొక మందును కనుగొనడానికి, అది గుణమిచ్చేకాలాన్ని పొడిగించడానికిగాని అనేక దేశాల్లో శాస్త్రజ్ఞులు కృషిచేస్తున్నారు. జినైదా ఎర్మొల్యేవా, ఎలెనాలాజరేవా అనే సోవియట్ శాస్త్రజ్ఞులు పెన్సిలిన్ జాతికి సంబంధించిన ఒక కొత్తమందును కనుగొన్నారు. దానిపేరు బిసిలిన్.

30,0000 యూనిట్ల మోతాదులో యీామందు యింజక్షన్ యిస్తే అది 6–7 రోజులవరకూ పనిచేస్తుంది. ఈ మోతాదును నాలుగురెట్లు హెచ్చిస్తే 30 రోజులపాటు అది పనిచేస్తుంది. అంటే నెలకు 180 పెన్సిలిన్ ఇంజక్షన్లకు బదులు ఒక్క బిసిలిన్ ఇంజక్షన్ చాలునన్నమాట. టాన్సిలైటిస్; నిమోనియా, మెనింజిటిస్, స్కార్లెట్ ఫీవర్ వంటి వ్యాధుల నిరోధానికీ, చికిత్సకూ యీా కొత్తమందు చాల తోడ్పడుతుంది.

'టాస్'

# మనోతరంగాలు

శ్రీమతి ఎం. లక్ష్మీదేవి



"ఎవరా వచ్చేవారు ?"

"ఎవరేమిటి? పై అంగవస్త్రాన్ని దులుపుతూ మీద పడేసుకొని ఒంగి నడక సాగించేటప్పుడే తెలియదూ, నాన్నగారని. నేను డబ్బుపంపమని ఉత్తరం వ్రాయగానే ఆయనగారి కోపమంతా అంగవస్త్రాన్ని ఎగిరించారుగాబోలు. డబ్బులేకుండా కాలేజీలో కూర్చుని ఏంచెయ్యడం ?

"పిచ్చి వెధవ. డబ్బు అంటే ఏమనుకొన్నావో?"

"చదువంటె ఏమనుకొన్నారో ?"

"డబ్బు డబ్బుఅని అలా సినిమాలకు కాఫీక్లబ్బులకు ఊరికే తగులెయ్యకపోతే తిన్నగ చదువుకొని రాలేవూ ?"

"డబ్బుంటెగాని చదువురాదు. ఆ రెండుకప్పుల వేడివేడి కాఫీ లోపలపోతేగాని పుస్తకం ముట్టుకోటానికి బుద్ధిపుట్టదు. అదీగాక ఇప్పుడుపరీక్షలు-ఈ రోజుల్లో డబ్బులేకపోతే కాఫీ ఎట్లా దొరుకుతుంది? ఆ కాఫీ లేకపోతే ప్యాసు అయ్యేదెట్లా ? ఏదో రెండు ముక్కలు తెలిసిందో తెలియందో రాస్తేగాని నాలుగు మార్కులు రావు. మార్కులు వస్తేగాని ప్యాసుగాను. ప్యాసయితేగాని ఉద్యోగం దొరకదు. ఉద్యోగం దొరికితేగాని డబ్బుదొరకదు. ఆఖరుకు ఎటుచూచినా డబ్బు డబ్బు"

"నువ్వేం రాజావా ! మహారాజావా ! ఊరికే ఆ కాఫీ త్రాగకపోతేనేం ?"

"ఇంతకంటె నేనేం చెప్పను మా నాన్నకు! రాజులు మహారాజులు. హుం – వాళ్లు మాత్రమే నా మనుష్యులు?"

"ఎవరబ్బాయి ? ఏమిటో రాజులు మహారాజులు అంటున్నావు ?"

"ఎవరయ్యా మహానుభావుడా ? ఈ దివ్య రూపంతో ఎక్కణ్ణుంచి దిగావూ ?"

"ఏం! నా ఇంద్రాయుధంనుంచి ఇప్పుడే దిగాను"

"ఇంద్రాయుధమా ?

"అవును నా గుఱ్ఱం"

"అయితే నీ వెవ్వరు ? చంద్రాపీడుడవా ?"

"అవును కనిపెట్టావే"

"మా భాషలో ఇంద్రాయుధం అంటె ఏమిటో తెలుసా ? ఇంద్రుని యొక్క ఆయుధం వేము బెత్తం."

"అంటె ?"

"అంటె, మా బాలవ్యాకరణంలో ఉదహరించాడే 'ప్రహరించెడు వాడు ప్రహర్త' అని అర్థం"

"...............”

"ఏం అట్లా ఆశ్చర్యంగా చూస్తున్నావేం ?"

"నీ మాటలు నాకేమి అర్థంగావటంలేదు"

"ఎట్లాఅర్థమౌతుంది? నువ్వుమహారాజువి. నాలాగు నాలుగు పరీక్షలు వ్రాసి అయిదు సార్లు ఫెయిలు అయి ఉంటె అప్పుడు నీకు తెలుస్తుంది. ఈ కాలంలో చదువుకోవడం సామాన్యంకాదని. డబ్బులేకపోతే కాఫీరాదు. కాఫీ లేకపోతే చదువురాదు. బుర్ర బ్రద్దలు కొట్టుకొని రెండు ఆన్సర్లు వల్లిస్తే అవే ప్రశ్నలురావు. వచ్చిన ప్రశ్నలకు ఆన్సర్లు తెలియవు.

అంతా తంత్రంలో ఉంది కార్యసిద్ధి. మూడురోజుల నుంచి శుకనాసోపదేశం వల్లిస్తున్నాను వల్లిస్తున్నాను కాని ఏమి బొత్తిగా బోధపడటంలేదు."

"ఏమన్నావు? శుకనాసుడా! మా ప్రధాన మంత్రిగారా!"

"ఓహోహో! ఎదురుగా నుంచున్నది చంద్రాపీడుడుగదా! ఎంతలో మర్చిపోయాను. ఇంకేం రొట్టె విరిగి పాలలో పడింది. సరేగాని ఆరోజు శుకనాసుడు నీకేం ఉపదేశించాడో దాన్ని ఉన్నదున్నట్లు చెప్పగలవా?"

"దీనికేం - చెప్పుతాను"

"సరే చెప్పు. నేనలాగే వ్రాసుకొంటాను" శుకనాసుని ఉపదేశము, శీర్షిక చెప్పు"

"వ్రాసుకో నాయనా! చంద్రాపీడుడా! సకల శాస్త్రములను తెలిసికొన్న నీకు నేను కొంచము గూడ నుపదేశింపదగినది లేదు. స్వభావసిద్ధముగనే యతి గహనమైన యజ్ఞాన రూపమైన యౌవన ప్రాదుర్భావము. భానువు చేత భేదింపఁదగనిదిగాను, దీపముల కాంతులచే పోగొట్టబడనిదిగా నున్నది. దారుణమైన లక్ష్మీవలన కల్గినమదము పరిణామముల చేత కూడను నశింపదగినదికాదు. ధనము వలన కల్గిన యజ్ఞానాంధత్వమును ఏయంజనము చేతను సాధింపదగినదికాదు. కనుక విపులముగా జెప్పుచున్నాను. ఆగర్భ శ్రీమంతత్వము, నూతన యౌవనము. సాటిలేని సౌందర్యము, మానవాతీత శక్తి సామర్ధ్యములు, ఒక్క వ్యక్తియందు ప్రత్యేకముగా నుండిననే యనేకనర్థములను వాటిల్లజేయును ఇకయంతయు నొక్కచో గూడిన జెప్పనేల? యౌవనారంభమునందు తఱచుగా శాస్త్రజలప్రక్షాళనచే శుద్ధమైన బుద్ధికూడ కాలుష్యమును పొందుచున్నది. ఎండుటాకుల కుప్ప వాయుప్రసారముచే అన్ని దిక్కులందు వీచబడుచున్నట్లు ప్రకృతికూడ పురుషుని యౌవన సమయమందు నిలుకడలేకుండ త్రోసివేయును. విషయాసక్తికల్గి చెడుమార్గప్రవృత్తికల పురుషుని దిగ్భ్రాంతునిజేసి నశింపజేయును. ఉపదేశమునకు మీవంటివారే తగియున్నారు. మాలిన్యరహితమైన మనస్సునందు చంద్రునికిరణములుస్ఫటికమణియందు వలె సులభముగా సదుపదేశములు ప్రవేశించుచున్నవి.

దుర్మార్గునికి జ్ఞానప్రదమగు సరువచనముకూడ సలిలము కర్ణశూల పుట్టించునదివలె నుండును. సన్మార్గునికి శంఖాభరణము గజాననమునకు శోభను గల్గించుచున్నట్లు అధికమగు శోభను గల్గించును. ధనమదాంధునికి కులీనతగాని, పాండిత్యముగాని వినయమునకు కారణముగాదు. మంచి గంధమువలన పుట్టిన యగ్ని ఇతరవస్తువులను దహింపదా? పురుషులకు సదుపదేశము మలినమును పోగొట్టు స్నానము వంటిది. బంగారముతో చేయబడని కర్ణాభరణము వంటిది. ప్రజలు నడవడికలందు రాజునే యనుసరించెదరు.

మంగళ స్వరూపుడవగు నీవు కొందట లక్ష్మి

## పిల్లల ఆహారం

పిల్లలకు ప్రత్యేకమైన అహార పదార్థాలను ఉత్పత్తి చేసేందుకు అనంద్‌లోని కైరా జిల్లా క్షీరోత్పత్తి దార్ల సంస్థ తలపెట్టిన పథకానికి భారత జాతీయ పరిశోధనల అభివృద్ధి సంస్థ ఆమోదం తెలిపింది. ఈ పథకం నిర్వహణకు పదివేల రూపాయల మొత్తం ఖర్చు అవుతుంది. మైసూరులోని కేంద్ర అహార విజ్ఞాన పరిశోధనా సంస్థ నిర్వహించిన పరిశోధనలు ఆధారంగా పై సంఘం పిల్లల ఆహారాన్ని తయారు చేస్తుంది.

స్వభావమును చూడుము. ఈ లక్ష్మి పాలసముద్రము నుండి చంద్రుని వక్రభావమును, ఉచ్చైశ్శ్రవము యొక్క చంచలత్వమును, కాలకూటము నుండి మోహనశక్తిని, మద్యమునుండి మదమును, కౌస్తుభ మణియొక్క నయితర కర్కశత్వము ఈ మొదలుగా గల చిహ్నములను గ్రహించి పుట్టినది. ఈ దుష్ట లక్ష్మిచేత ఈ జగత్తునందు పరిచితముకాని వస్తువు లేదు. పొందబడినప్పటికి మిక్కిలి కష్టముగా రక్షింపబడుచున్నది. దృఢమైన గుణపాశములచేత కట్టుటవలన నిశ్చలముగా నున్నప్పటికి మాయమగు చున్నది. చిరపరిచయముకలవారిని నిరీక్షించదు. వంశ పారంపర్యముగా నున్నను చూడదు. శీలమును చూడదు. శాస్త్రమును వినదు. ధర్మగుణము ననుస రించుటలేదు. దానగుణము కలవారి ననుసరించదు, విశేషతెలివిగలవానిని విచారింపదు. గాలిలో మేడల వలె చూచుచుండగనే మాయమగుచున్నది.

చంచలయైన ఈ లక్ష్మి ఎట్లు ప్రకాశించు చున్నదోకాని దీపశిఖవలె మలినమునే పుట్టించు చున్నది. ఆశ యనెడి విషలతను పోషించు నీటి ప్రవాహము వంటిది. ఇంద్రియములనెడి మృగము లకు కిరాతగానము వంటిది. అజ్ఞాన దీర్ఘ నిద్రకలవార లకు విలాసశయ్యవంటిది. దుష్టసర్పనివాసమునకు గుహవంటిది. ఈ జగత్తుయొక్క కపటనాటకమునకు నాందీముఖము. ధర్మమనెడి చంద్రమండలమునకు రాహువువంటిది.

పట్టాభిషేక సమయమందు రాజులయొక్క దాక్షి ణ్యము మంగళకలశ జలముచేత కడుగబడుచున్నది. అగ్నికార్య ధూమముచేత హృదయము మలినముగాఁ జేయబడుచున్నది. జరాగమన సూచకమగు తలపాగా పట్టబంధములచేత కప్పబడుచున్నది. పరలోక వాంఛ గొడుగుల సమూహముచేత అడ్డగింపబడుచున్నది. సత్యవాదిత్వము వింజామరల గాలులచేత ఎగురవేయ బడుచున్నది. మంచి గుణములు వేత్రదండములచేత చితుకగొట్టబడుచున్నవి.

ఎవడు రాత్రింబగళ్లు యెల్లప్పుడు నమస్కారము చేయుచు దేవునివలె స్తోత్రింపబడునో, ఎవడు వాని గొప్ప తనమును జెప్పునో, వానితో మాట్లాడు చున్నారు. వానిని ప్రక్కన జేర్చుకొనుచున్నారు. వానితోకూడ సుఖముగా నున్నారు. పట్టాభిషేకము జరిగిన తర్వాత సప్తద్వీప గర్భితమగు భూమిని జయిం పుము. త్రిలోకమునుఁ జూచుచున్న సిద్ధునివలె నుండుము" అని చెప్పెను.

"భలే! భలే! మంచి ట్రాన్సులేషన్, ఈ ప్రశ్న వచ్చిందంటె ఫస్టుమార్కు కొట్టేస్తాను. సరే గాని నువ్వెమో మహాశ్వేతకు సహగమనంనుండి విర మించడానికి ఏమో ఉపదేశించావట, అ ముక్క కూడ కాస్త చెప్పేద్దూ ?"

"సరే! చెప్తాను. వ్రాసుకో, - అదేం గంట కొట్టుంది ?"

"ఓ అదా! సైకిలు బెల్, మా స్నేహితుడు వచ్చాడనుకొంటాను."

"సైకిలు, అంటె!"

"అదా, మా యింద్రాయుధం"

"అరరే! నా ఇంద్రాయుధం ఎక్కడా ?"

"మా గ్రౌండులో పచ్చిగడ్డిని చూసిందేమో!"

"ఏమిట్రావాగుడు ? ఎందుకురా పచ్చిగడ్డి!" ఒక్కదెబ్బ కొట్టాడు రాఘవం.

ఉలిక్కిపడి కళ్ళుతెరిచాను. చేతులోఉన్న కాదంబరీ వ్యాఖ్యపుస్తకము క్రిందపడింది.

—:0:—

# శ్రీ రామ కర్ణామృతము

( ఆంధ్రానువాదము )

శ్రీ కల్లూరి అహోబలరావు.



(గత సంచిక తరువాయి)

౯౭

శ్రీ మనోహర ! కరుణామృత సాగరా !
జయజయ ! రఘురామ చంద్ర! నీకు !
పద్మాక్ష ! రఘువీర ! పాపసంహారకా !
జయజయ ! శ్రీరామచంద్ర ! నీకు !
ఉర్వీజాకరపద్మయుగసద్మ ! భుజయుగ్మ !
జయజయ! రఘునాథ! జయము నీకు!
సజ్జనుత ! చిత్రచారిత్ర ! నుతిపాత్ర !
జయజయ! రఘువరా! జయము నీకు!
శ్రీ ముఖాంభోజ భాస్కరా ! శ్రీ విలాస !
జయము ! రఘునాథ ! శ్రీరామ !
జయము ! జయము !
జయము! కోదండరామ! దిగ్జయము నీకు!
జయములొసఁగి రక్షింపుమా సారసాక్ష !

౯౮

శంఖంబు, గదయును-చక్రంబుఁ జేఁబట్టు
మాధవ ! జయజయ మంగళములు !
దాసుల ప్రార్థితార్థముల నొసంగెడు
మంగళాత్మక ! జయమంగళములు !
త్రిభువనమయుఁడవై ప్రియమున భక్తుల
యంగరక్షక నీకు మంగళములు !
ప్రాణి మాత్రంబుల భావజ్ఞుఁడవు నీవు
మహిమోన్నత విశాల మంగళములు !
శ్రేష్ఠుఁడవు, యోగ్యుఁడవు రక్షింపగాన
శరణుజొచ్చితి నిన్ను, విచారముడిపి
మానసానందము నొసంగి, మమతతోడ
రక్షసేయుము, శ్రీ రఘురామచంద్ర !

౯౯

వేదతతిని దెలియగాఁదగు పూజ్యుండు
దశరథునకుఁబుట్టఁ దలప్రసుతుఁతె
రక్తితోడ మహిని రామాయణంబావె
వరుణసుతుఁడు దాని వ్రాసెగాదె.

౧౦౦

మనసు సతతంబు శ్రీరామ స్మరణమందె।
యుంచు నెవ్వాఁడు
నాతండు మించుభక్తి। 'రామ' యని
యొక్కసారి పల్కంగఁ
జాలు, నతనియేక శతాన్వయ మందు
కొనును
ముక్తి సంపద దీని నమ్ముము-నిజమ్ము-

౧౦౧

'రామ' శబ్దంబు ప్రథమాక్షరంబు, 'రా'య
నుచుఁ బలుక, పాపపుంజముల్ నోటినుండి
వెడలు వేవేగ, మఱివచ్చుభీతి 'మ'యను
నక్షరంబు, కవాటమై రక్షసేయు



6

మనుజతతిఁ గాన, తిరిఁబ్రతిమానవుండు
'రామ' శబ్దంబు సతతంబు రక్తితోడఁ
జింతసలిపి, దోషము వాసి సంతసంబుఁ
జెంది, మోక్షంబు బొందుటే క్షేమకరము

౧౦౨

ఆదికావ్యంబుగా నలరారుచుండును
మహిమాన్వితంబు, రామాయణంబు
వాల్మీకిఋషి దీనిఁ వ్రాసె ; దేవతలెల్ల
పూజించుచుందురీ పుణ్యకథను
వేదాంత శాస్త్రార్థ విద్వాంసులను దినం
బీ రామకథఁ బఠియించుచుంద్రు
కల్పకమునకు, నిక్కంబుగా సాటి యా
శ్రీరామకథ విన్నవారికెల్ల
ముక్తిసేకూరు ; భక్తి రాము కథనంబు
వ్రాసినను, విన్నఁ జదివిన, వారికెల్ల
నఘము తొలఁగి, విష్ణుస్థాన మబ్బుచుండు
దీన సంశయ మొక్కింత పూనవలదు.

౧౦౩

సంస్కృత భాషలో శంకరాచార్యులు
'రామకర్ణామృత' రచన, భక్తి
పారవశ్యంబున వ్రాసి వెలార్చిరి ;
చేకూరువంశ ప్రసిద్ధసుకవి
సిద్ధకవీశ్వర శేముషీ ధీశాలి
యాంధ్రంబులో, దాని ననువదించి
శ్రీరామమూర్తికిచ్చినవారు, పూదండ
గా, మోక్షసిద్ధికై కౌతుకమున
నతని పూదండ కొసంద మర్పణంబు
సేసి, నా భక్తి తెలుఁగున జిన్ని 'పూల
మాల' నర్పించినాడ ! రమా వినోద !
కైకొనుము నాదు కానుక లోకనాథ !

౧౦౪

విద్వాంసుడఁ గాను-విద్యయా సున్న, శా
స్త్రజ్ఞానము హుళిక్కి ; ప్రజ్ఞకొఱత,
గూళూరు కృష్ణార్య కొమరుఁడ హోబల
రావని పిలుతురు ; బ్రాహ్మణుఁడను
కాశ్యప గోత్రుండఁ గవి కొంత సేయంగ
నేర్చితిఁ గాని, నే నేర్వఁ గావ్య
ములగాని, లక్షణములగాని, వ్యాకర
ణముగాని, 'రామకర్ణామృతంబు
ముప్పదియుఁ బైగ వత్సరముల సుదినము
దప్పకఁ బఠించుచున్నాడ ; దానివల్ల
కల్గు సుకృతిని. నీ కావ్యకన్య పుట్టె
వినవె ! యమృతము, రామ సేవింపు
మయ్య

౧౦౫

తెలుఁగువారికెల్లఁ దేట తెల్లముగాఁ
దెలుఁగు బాష తీపి తెలియునట్లు
రచన సలిపినాడ-'రామ కర్ణామృత'
మాదరింపుడయ్య-యాంధ్రులార !

౧౦౬

శ్రీరమాపతి నాకిచ్చి చిత్తశుద్ధిఁ
గీలుబొమ్మగ నన్నుంచి కేవలముగ

మొదటి యాశ్వాసము, ముగించె మోద
మలర
ప్రాంజలి నొనర్తు; శ్రీరామభద్రునకును.

౧౦౭

కావ్యమంథలి, సుగుణ విఖ్యాతిరామ
చంద్రునిది; యవగుణముల సారమెల్ల
నాదియని విన్నవింతును మోదమలర,
గుణము గొనుడయ్య యంచల గణము
వోలె.

౧౦౮

విమల కమలమూర్తీ! విస్ఫురన్నీలమూర్తీ!
శమదమగుణ సాంద్రా సాధు సంతాప
చంద్రా!
సుమ శరసమగాత్రా సూరిసంస్తోత్రపాత్రా!
సమద దనుజజైత్రా! త్య్మతనూజాకళత్రా!

ప్రథమాశ్వాసము సంపూర్ణం

ఓం-శ్రీరామచంద్రాయనమః

---

# భావాంతరాలు

## శ్రీ కన్నెకంటి ప్రభాకరశాస్త్రి

పుట్టి పుట్టక పూర్వమే చిట్టిబాబు
తేల్చుకొన్నాడు నీయంతు తెలివితోడ!
చిన్నినవ్వుచే బంధించె చూడుమమ్మ!
మరచి పోతివి సోదరీ! మమ్ముగూడ!

తమలపాకుల నములుచు తలపులెన్నో!
గుములుకొన పశిపాపని గూర్చి నీవు
మన్ననము చేయుచుందువు మనసులోన
హృదయ సాఫల్య మొందిన యింతి వమ్మ!

నిద్ర బోవక బాబును భద్రముగను
చేయిపై వేసి కునుకును తీయుచుందు
చీకు చిటుకు మన్నంతనే చెంతజేరి
జోల పాటను బాడెడి వేలవమ్మ!

ఏడ్పు వినినంతనే నీవు ఎక్కడున్న
పరుగు పరుగున వత్తువు భయముతోడ
చిన్నచిరునవ్వు నవ్విన చెంత జేరి
సంతసంబును బొందెదవే స్వాంతమందు!

చిన్న యల్లుడు జన్మించె చెల్లి నాకు
మాట వరుసకు పలికిన మాటలన్ని
మనము నందున నుంచకు మరలవత్తు
ఆయురారోగ్య భాగ్యాల నలరు మమ్మ

# పెద్దమనిషి

"ప్రమద"



పాత్రలు:-

శేషయ్య:-పల్లెటూరిలోని పొలంగల ఆసామి.

కోదండం:-అదే పల్లెటూరిలోని మరొక బ్రాహ్మడు - బీదవాడు.

భాస్కరం:-శేషయ్య మేనల్లుడు, మద్రాసులో బి. ఎ. చదువుతుంటాడు.

మాలతి:-శేషయ్యకూతురు.

ముకుందమ్మ:-శేషయ్య చెల్లెలు, భాస్కరం తల్లి.

[ప్రదేశం. పల్లెటూరి వాతావరణాన్ని సూచిస్తుంది. పాత పెంకుటింటిలో ఒక భాగం. వరండాలో ఒక చాపమీద ముకుందమ్మ కూర్చుని ఉంటుంది. కుర్చీ మీద శేషయ్య కూర్చుని చుట్ట వెలిగిస్తాడు.]

శేషయ్య:-సరేనమ్మాయి! నీ ఇష్టప్రకారమె మాలతిని భాస్కరానికి ఇస్తాను. సరేనా?

ముకుందమ్మ:-సరే నన్నయ్యా! నా సంగతి తెలుసు గదా! మాలతికి నేనేమి పెద్దగ ఇవ్వలేము.

శే:-సరేలెవే నువ్వంత చెప్పాలా? వాడు సంపాదిస్తే పెట్టడూ! (దూరాన వింటున్న మాలతి తలవంచుకుంటుంది.)

ము:-నిజమె. ఇదిగో మా వూళ్ళో వెంకటప్పయ్య గారు పెట్టిన ముహూర్తము ఏప్రియల్ పదవ తారీకయితే బాగుంటుందని ... ...

శే:-సరేనమ్మా. ఈ పూటే మన వీరభద్ర శాస్త్రి గారిని పిలుస్తాను. అవా ... అందుకు కాదు ఒకరిద్దరుమాస్తే మంచిదిగదా!!

ము:-అవును. సరే చూపించు. నేనీపూట ఉండికే వెళ్తాను.

శే:-ఏంతొందర? రేపు వెళ్ళవచ్చు.

ము:-కాదులే అన్నయ్యా! అక్కడ సున్నాలు అవీ కొట్టిస్తున్నానా - ఆలశ్యమవుతుంది.

శే:-సరే నీ యిష్టం (కుర్చీలోంచి లేస్తాడు) ఇప్పుడే శాస్త్రులగారిని పిలుస్తున్నా.

[కోదండం ప్రవేశం. నలభై అయిదేళ్ళు ఉంటయి. గొడుగు కర్రతో నేల మీద కొట్టుకుంటూ వస్తాడు.]

శే:-(మళ్ళీ కుర్చీలో కూర్చుంటూ) రండి, రండి, కోదండంగారు, మా అమ్మాయి పెళ్ళి నిశ్చయమైంది.

కోదండం:-(లేనిసంతోషంతో) అలాగా ఎప్పుడు? చాల సంతోషం.

శే:-మా మేనల్లుడు భాస్కరం, మదరాసులో బి. ఎ. చదువుతున్నాడు. వాడికి. ఇదిగో ఏప్రియల్ పదివతారీకున పెండ్లి.

కో:-భాస్కరమా! భాస్కరమంటే మన ముకుందమ్మ కొడుకుగదూ! నాలుగేళ్ల క్రిందట వచ్చాడు. అప్పుడు స్కూలు ఫైనలు చదువుతున్నాడుగదూ!

శే:-అవును.

కో:-వాడు, మా వెంకన్న పక్కపక్క గదుల్లోనేట ఉండటం.

శే:-అలాగా!

కో:-(దగ్గిరకివచ్చి) ఇదిగో చూడండి. మీరు ఈ సంబంధం మానుకోండి.

శే:-(ఉలిక్కిపడి) ఎందుకు?

కో:-చూడండి మీ వాడు క్లబ్బులట, సినిమాలట, బోగంకొంపలు గూడానట. ఈ వుత్తరం చూడండి. (ఉత్తరం ఇస్తాడు.).

శే:-ఇది మీ కట్లా తెలుసు.

కో:-మా వెంకన్న వ్రాశాడు. మీ చెల్లెలు భాస్కరానికి వ్రాసిందట. ఈ పెళ్ళి సంగతి మా వాడు తెలుసుకుని మీ మంచికోరి వ్రాశాడు.

శే:-ఆ! ఇంత వెధవ వాడువా! పైగా ఏం తెలీనట్టుమా పిల్ల ఎందుకు ఇక్కడకువచ్చి నాటకం ఆడింది? కట్నం వద్దన్నది ఇందుకేనన్న మాట! ఎంత పొగరు. (కేకేస్తాడు.) ముకుందం! ముకుందం!

ము:-వస్తున్నానన్నయ్యా. (కోదండం నిష్క్రమణ).

శే:-పో! నా ఇంట్లోంచి తక్షణంపో! నీ మోసం తెలుసుకున్నాను, వెళ్లు. ముందు నా యింట్లోంచి కదులు!

ము: (నిర్ఘాంతపోతు) ఏంటన్నయ్యా?

శే.-ఏమిటా! నీ కొడుకు ప్రతాపం! కదలవేం!

ము:-ఉన్నట్టుండి ఇంత హఠాత్తుగ మారిపోయావేమిటి.

శే:-మారిపోయానా! ఇంకా మారుతాను! నువ్వు మాత్రం ఇక్కడుండటానికి వీల్లేదు-పో.

ము:-సరే, పోతున్నాను. మళ్ళీ పిలిచినపుడే వస్తాను

(శేషయ్య కండువా మీదేసుకుని బయట కెళ్తాడు.)

(పదిరోజుల అనంతరం జరిగిన కథ)

[భాస్కరం సూట్కేసుతో వస్తాడు. ప్రదేశం: అదే ఇల్లు.]

---

## గ్రామ పరిశ్రమలకు సహాయం

గ్రామ పరిశ్రమల పురోభివృద్ధికి ఏడు రాష్ట్ర ప్రభుత్వాల పథకాలకుగాను భారత ప్రభుత్వం 89,900 రూపాయలను గ్రాంటుల రూపంలోను ఋణాల రూపంలోను మంజూరు చేసింది.

ఆంధ్ర పంజాబులలో గ్రామ తోలు పరిశ్రమలు, మైసూరులోని దంపుడు బియ్యం పరిశ్రమ, జమ్ము - కాశ్మీరులోని చేతికాగితం పరిశ్రమ, మద్రాసులోని కుండల పరిశ్రమ, మణిపూర్‌లోని సబ్బుల తయారీ పరిశ్రమల అభివృద్ధికి ఆ మొత్తం వినియోగించబడగలదు.

---

భాస్కరం:-మామయ్యా.

శే:-ఎవరు. భాస్కరమా? ఎందుకొచ్చావు?

భా:-ఎందుకేమిటి మామయ్యా! పెళ్ళి అని ... ...

శే:-పెళ్ళి! మళ్ళీ ఏమొహం పెట్టుకుని అడగటం.

భా:-మేమేం చేశాము మామయ్యా! (కళ్ళ నీళ్ళు జేబు రుమాలుతో తుడుచుకుంటాడు.)

శే:-ఒరేయి! నీ యాటలు నా దగ్గర కాదు.

భా:-తండ్రిపోయిన నన్ను మా అమ్మని పెంచావు. నీ దగ్గరుంచుకుని పోషించావు. మళ్లీ ఇప్పుడే మొచ్చిందో అర్థంకావటంలేదు.

శే:-అర్థంకాదురా. నువ్వు క్లబ్బులకు, భోగంకొంపలకు పోతున్నావుటగా ...

భా: (ఆశ్చర్యంతో) నేనా.

శే:-ఏంనటన! నాటకాలుకూడ వెయ్యపోకపోయినా.

భా:-ఎవరు చెప్పేరు.

శే:-కోదండం.

భా:-ఓహో! కోదండం అసాధ్యుడే-పెద్ద నాటకం ఆడేడు.

శే:-నాటకమా!

భా:-అవును మామయ్యా. నీకు నామీద లేనిపోని మాటలు చెప్పేడు. అంతేగాదు నమ్మించాడు. కట్నంలేకుండా వస్తున్న సంబంధంపోగొట్టుకోటం కోదండానికి ఇష్టంలేదు. అందుకని ఈ పెళ్ళి చెడగొట్టి తన కూతురుని నా కిచ్చి పెళ్ళిచెయ్యాలని చూశాడు. కాని ఈ సంగతి నాకు తెలిసి నేను ఇక్కడకు వచ్చేను.

శే:-నీ కలా తెలిసింది.

భా:-నేను, వెంకన్న పక్కరూములలోనే ఉంటున్నాము. నిన్న పదింటికి అతను స్నానానికి వెళ్ళాడు. అతనికి లెటరు వచ్చింది. దాన్ని నేను రిసీవ్ చేశాను. దాన్ని చదివాను. ఇదిగో ఆ ఉత్తరం. చదువుకో అంతా తెలుస్తుంది.

శే:-(ఉత్తరం చదివి) నన్ను క్షమించు భాస్కరం. అప్పుడే ఈ సంగతి తెలిస్తే ఇంతవరకు వచ్చేది కాదు. ఎల్లుండి పదో తారీకే పెళ్ళి భాస్కరం. మీ అమ్మకు టెలిగ్రాంకొట్టు రమ్మని. త్వరగాపో-

భా:-పోతున్నా మామయ్యా. (నిష్క్రమణ.)

(ఇందులో మాలతిపాత్ర కనపడదు. కాని ఆ పాత్ర ఉండితీరాలి.)

# మారిన మనిషి

శ్రీ ఎస్. చంద్రశేఖర్

తెల తెలవారుతుండగానే లేచి నాగలి భుజాన వేసుకొని పొలం వెళ్ళడం, ఎండ వాన అనకుండా భూమి దున్నడం, సూర్యాస్తమయపు వేళకు, పక్షులు గూళ్ళు చేరుకొంటుంటే, ఎడ్ల వెనక ఉత్సాహంతో యింటికి చేరుకోవడం గోవిందలాల్ దినకృత్యమైపోయింది.

గోవిందలాల్‌ది తాటాకులతో కప్పబడ్డ ఓ చిన్న యిల్లు. ఆ యింట్లో గోవిందలాల్, అతనితల్లి రుక్మిణిబాయ్ వుంటున్నారు.

రుక్మిణీబాయ్‌కి నలభై, యాభై సంవత్సరాల మధ్య వయసువుంటుంది. జుట్టు వెండిలా పండిపోయింది. మొహం ముడతలు పడింది.

గోవిందలాల్ ఆరోగ్యంగాను, బలిష్ఠంగా పొడుగ్గా వుంటాడు. ఇరవై అరుదు సంవత్సరాల వయస్సుంటుంది. అతనెప్పుడూ నిర్విచారంగా వుంటాడు. ఉన్న దాంట్లోనే తృప్తిపడేరకం. కాని, అతని దవడమీదున్న, వికృతపు పెద్ద మచ్చవల్ల, చూచేవాళ్లకు భయంకరంగా కనబడతాడు. కాని ఎవరన్నా అన్యాయానికి తలపడితే, అతని మచ్చకన్న వికృతస్వరూపం దాలుస్తాడు.

గోవిందలాల్ అన్న, యుద్ధంలో చేరి, వీరస్వర్గం అలంకరించాడు. తండ్రి రెండు సంవత్సరాలక్రితమే చనిపోయాడు.

గోవిందలాల్ అన్న చనిపోయినందుకు ప్రభుత్వం ఆ కుటుంబానికి వెయ్యిరూపాయలు పరిహారం యిచ్చింది. తండ్రి పోతూ పది కుంట్లభూమి వదిలిపోయాడు. ప్రస్తుతం ఆ కుటుంబ జీవనాధారాలయ్యాయి.

గోవిందలాల్‌కి వ్యవసాయం చేయడం బాగావచ్చు. తనకు వూహవచ్చిందగ్గర నుంచి, తండ్రితో పొలంపోయి, ఆయనకు అడపాతడపా సహాయపడుతుండేవాడు.

సంధ్య దీపాలు పెట్టేసరికి గోవిందలాల్ యిల్లు చేరుకొని ఎడ్లను కట్టేసి వాటిముందు చెత్త తీసేసి, మంచిగడ్డివేసాడు. వాళ్ళమ్మకు పొయ్యిలోకి కావలసిన కట్టెలన్నీ గొడ్డలితో కొట్టిచ్చాడు. రుక్మిణీబాయ్ అవి తీసుకొని "స్నానం చేసి రా నాయనా! అంతలో వంటచేసేస్తా" నంది "సరే" అంటూ భుజంమీద తువ్వాలు వేసుకొని కాలవవైపు బయలుదేరాడు.

అతను తిరిగివస్తుండగా, దీపపుకాంతి కిరణాలు తలుపుసందుల్లోంచి ఎంతో రమ్యంగా కనబడతోంది. ఆ కాంతి కిరణాలలో పొగచేరి మరింత స్పష్టంగా కనబడుతూ చక్కగా కనబడుతున్నాయి. యింటికి చేరేసరికి అతని 'జాగిలం' ఎక్కడా కనబడలేదు. నెమ్మదిగా ఈలవేశాడు. ఎక్కడనుంచి విన్నదోగాని, తోకాడించుకొంటూ, బుల్లి బుల్లి అడుగులు వేసుకొంటూకుఁయ్! కుఁయ్! అంటూ అతని దగ్గర చేరింది.

గుడిసెలో రుక్మిణిబాయ్‌కి ఊపిరిసలపకుండా పొగదట్టంగా నిండింది. పొగ బైటకు పోవడానికి ఎక్కడా సందు దొరకలేదు. అందుచేత యింకెక్కడా చోటు దొరకనట్లు ఆమెకళ్ళల్లోకి ముక్కులోకి కూడా దూరింది. ఆమెకళ్లునీళ్ళతో నిండిపోయింది. ముక్కువెంట నీరుకారుతుంది. యింక ఆమెకు ఊపిరి సలపడం కష్టమైంది. బైటకెళ్ళడానికి తలుపుతీసి బయటకొచ్చి చల్లగాలిలో కొంచెం సేపు హాయిగాగాలి పీల్చి తిరిగి వంటలో నిమగ్నమైపోయింది.

గోవిందలాల్ కొంచెం సేపు కుక్కతో ఆడుకొన్నాడు. కడుపులో ఆకలిదహించేస్తుంది. అమ్మపిలుస్తుందేమోనని ఎదురుచూస్తున్నాడు. కాని ఎటువంటి అలికిడి లేకపోయేసరికి తలుపుతీసుకొని సరాసరి యింట్లోకి వెళ్ళాడు. రుక్మిణీబాయ్ శుభ్రంగా ఊడ్చి భోజనం పెట్టింది. గోవిందలాల్ ఆత్రుతగా నాలుగుమెతుకులు తిని కడుపు చల్లార్చుకొన్నాడు.

భోజనం అవగానే గోవిందలాల్ బయటకొచ్చి అరుగుమీద కూర్చుని ఆకాశంలో నక్షత్రాలు చూస్తూన్నాడు. రుక్మిణిబాయ్ కూడా భోజనంచేసివచ్చి అతని ప్రక్కనే కూర్చుంది. కొంతసేపటివరకు ఎవరూ మాట్లాడలేదు. చివరకు రుక్మిణియే మొదలు పెట్టింది.

"ఏరా! నాయనా నేను బ్రతికుండగానే నీవొకింటివాడవైతే కళ్ళారా చూచి ప్రాణాలు విడుద్దామనుంది" అంది నిశ్శబ్దాన్ని చీలుస్తూ. గోవిందలాల్ ఏమీ మట్లాడలేదు.

"అదికాదురా; కన్యాలాల్ కూతురుంది చూచావ్ - దుర్గనందిని, ఆ అమ్మాయి చాల బాగుంటుంది. మనం అడిగితే కాదనడు. నీవు ఊఁ! అంటే చాలు రేవు నేవెళ్ళి కన్యాలాల్‌ని అడుగుతా" అంది.

గోవిందలాల్ ఆలోచించాడు. ఆ అమ్మాయి బాగానే వుంటుంది. ఆ అమ్మాయి వప్పుకొంటే తను నిక్షేపంగా వప్పుకోవచ్చు. ఒకవేళ ఒప్పుకొంటే తనకు డబ్బు కావలసివస్తుంది. కనీసం వెయ్యిరూపాయలన్నా ఉండాలి. పొలం

మీాదవచ్చే ఆదాయం, కడుపునింపుకో డానికే సరిపోతుంది. యిదివరకు, తన అన్న చనిపోయినప్పుడు ప్రభుత్వం యిచ్చిన సొమ్ము ఎక్కడో దాచినట్లు అమ్మచెప్పింది- అది ఉపయోగించుకోవచ్చు.

''ఏం ఆలోచిస్తున్నావురా!'' అనడిగింది.

''ఆఁ! ఏంలేదుగాని, నీయిష్టప్రకారమే కానివ్వు; అయితే ఒకవేళ వాళ్లు గాని ఒప్పుకోంటే. అన్నయ్య తాలూకు సొమ్ము వెయ్యిరూపాయిలు వాళ్లకిచ్చి దుర్గనందినికి నగలు చేయించమని యివ్వు''అని చెప్పి నిద్రకు పక్రమించాడు. రుక్మిణిబాయ్ సంతోషానికి అంతులేక పోయింది. ఏమేమో కలలుకంటూ నిద్ర పోయింది.

ఆ మర్నాడే రుక్మిణీభాయ్ కన్యాలాల్ ఇంటికి వెళ్ళి ఆ సంబంధం ఖాయంచేసి, వెయ్యి రూపాయలు యిచ్చివచ్చింది. ఆ సాయంత్రమే గోవిందలాల్‌కి చెప్పింది.

ఆ తర్వాతకొంతకాలం వరకూ గోవిందలాల్ ఆవిషయంగురించి ఏమీా పట్టించుకోలేదు. పొలంలో యిదివరకుకన్న కష్టించి పని చేయడం మొదలు పెట్టాడు.

ఒక రోజున పొలంలో పని చేస్తూ, అటువేపు వెళ్లుతున్న దులారామ్‌ని చూచి ఆశ్చర్యపోయాడు. దులారామ్, తను చిన్నప్పటి స్నేహితుడు. ఈ మధ్య దులారామ్‌బొత్తిగా కనిపించడం మానివేశాడు. అతన్ని చూడగానే గోవిందలాల్‌కి ఎంతో సంతోషంవేసి పిల్చాడు.

''ఏరా! దులారామ్! ఎక్కడా కనిపించడంలేదే. యింతకాలంనుంచి ఎక్కడున్నావ్? ఏం చేస్తున్నావ్? యింటిదగ్గర అంతా కులాసా?'' అంటూ అనేక ప్రశ్నలతో ముంచెత్తాడు.

''అంతాకులాసాగానే ఉన్నారు గాని, నీ వెట్లావున్నావ్? నీ పెండ్లి ఎప్పుడు'' అనడిగాడు.

''నాపెండ్లికేం తొందరగాని? నీ పెండ్లెప్పుడుచెప్పావుకావు? అసలు యింతకీ దారి తప్పి యిట్లావచ్చావే? ''అనడిగాడు. గోవిందలాల్

''నా పెండ్లికేంగాని, నా మిత్రుడు దుర్గాదాస్‌కి వివాహసంబంధం చూడ్డానికి వచ్చాంలే! అన్నట్లు నీవెరుగుదువా? ఆ చెరువుగట్టు ప్రక్కన పెద్ద అరుగుల యిల్లు లేదు. ఆయనే ... కన్యాలాల్. ఆయన కూతురుంది చూచావూ! దుర్గనందినీ చక్కనిచుక్క. ఆమెను దుర్గాదాస్‌కివ్వడానికి నిశ్చయమైంది. పెండ్లికి నీవుకూడా వస్తావుకదూ?'' అనడిగాడు దులారామ్.

ఆ విషయం వినేసరికి గోవిందలాల్ నవనాడులన్నీ కృంగిపోయినట్లంది.

ముహంలో నెత్తురుచుక్క లేనట్లు వెలవెలబోయింది. కాని ప్రక్కన స్నేహితుడున్నాడు. అందుచేత అతనేమీ తొట్రుపడకుండా

"ఆదుర్గాదాస్‌ని, నేనెరగను. పెళ్లికి నేనెల్లావస్తాను." అన్నాడు.

"నేనున్నానుగా మరేంపర్వాలేదు ! అయితేవస్తాను. చీకటిపడుతుంది" అంటూ గోవిందలాల్ దగ్గర శెలవుతీసుకొనివెళ్ళిపోయాడు దులారామ్.

◆ ◆ ◆

గోవిందలాల్ కిపనిచేయ. బుద్ధిపుట్టలేదు మాటిమాటికి దులారామ్ చెప్పిన మాటలే చెవుల్లో రింగుమంటున్నా, అనేక వూహాలతో బుర్ర వేడెక్కిపోయింది. కన్నాలాల్ ఒకళ్లను న్యూనతపరిచేవ్యక్తా ? అట్లా ఎన్నిటికి జరుగదు ? ఒక వేళ దులారామ్ తప్పు చెప్పాడేమో ? లేకపోతే అమ్మవాళ్లకు నగలు చేయించమని డబ్బుయిచ్చిందోలేదో? అసలు విషయం తేల్చుకోందే తనకు నిద్రపట్టదు. అతనిలో సహనశక్తి లోపించింది. తిన్నగా యింటికి బయలుదేరాడు.

ఇంటికి చేరుకొనేసరికి సాయంత్రం అవనే అయింది. యింటిముందు నుంచుని,

"అమ్మా?...అమ్మా!" అంటూ గర్జించాడు

"ఎందుకురా!" అనడిగింది లోపల పొయ్యి రాజేస్తూ.

"యిటురా!" అని మరోసారి గర్జించాడు.

ఆమె గుడిసెలోనుంచి బైటకు వచ్చి, గోవిందలాల్ వైఖరి చూచి "ఏమిటి నాయనా? ఏమి జరిగింది" అనడిగింది ఎంతో ఆతృతగా.

ఒక్కసారి ఆమెవైపు సూటిగా చూచి

"ఏమిటి నేను విన్నది నిజమేనా? నాకిస్తానన్న దుర్గనందినిని దుర్గాదాసుకి ఖాయమైందట? నీవు వాళ్ళను సరిగా కనుకొన్నావా? నీవు వాళ్ళకు డబ్బుయిచ్చావా? ఏమిటి-ఏం జరిగింది? నీకు ఈ విషయాల గురించి తెలుసా?" అంటూ ప్రశ్నపరంపర కురిపించాడు.

ఆమె ఈ విషయాలన్నీ విని నిర్వీర్యురాలైపోయింది. ఆమెలో భయం ఆవహించింది. మాట్లాడదామంటే గొంతు పూడుకుపోయింది.

"లేదు - తెలియదు నాకేమీ తెలియదు" అంది గొంతుక జీరపోయినట్లు.

"అయితే పదు. అదేమిటో తేల్చుకొందాం" అన్నాడు కరుగ్గా.

అతను గ్రామంలోకి పెద్ద పెద్ద అంగలతో నడవడం మొదలుపెట్టాడు. అతని వెనకే రుక్మిణీభాయ్ తొట్రుపాటుగా పరుగెత్తడం మొదలుపెట్టింది. వాళ్లు అట్లా కొంతసేపు నడచి చివరకు కన్యాలాల్ యింటికి చేరుకొన్నారు. అప్పటికి చీకటి నలుమూలలా వ్యాపించింది.

కన్యాలాల్ వారింటి వరండాలోనుంచి వారిరాకను అప్పుడే చూచాడు. అతని ప్రక్కనే కాబోయే అల్లుడు దుర్గాదాస్ కూడా వున్నాడు, వాళ్ళను చూచి కన్యాలాల్ ఏమీ ఎరుగనట్లు కూర్చున్నాడు.

గోవిందలాల్ అభిమానం కట్టలు త్రెంపుతోంది. కళ్ళు జేవురించడం మొదలుపెట్టాయ్, వంటినిండా జెర్రులు తేళ్ళు ప్రాకినట్లుయింది. కాని తమాయించుకొని,

"నేను ఏరోజున మీ అమ్మాయిని చేసుకోడానికి రమ్మంటారు" సూటిగా అడిగాడు.

కన్యాలాల్ మొహం కొంచెం క్రిందకు వంచి "మీరిచ్చిన సొమ్ము సరిపోదు. మా అమ్మాయికి దుర్గాదాస్‌కు వివాహనిశ్చయం చేసుకొన్నాను. యికమీద మీరు యిక్కడకు వచ్చి అల్లరి పెట్టడం బాగుండదు." అని లోలోపలే సణిగాడు.

"అంతేనా?" అనడిగాడు గోవిందలాల్.

"అంతేకాకపోతే, మీరిచ్చిన సొమ్ము సరిపోదు. పైగా నాకూతురుమీద హక్కు నాకుంది. నాయిష్టంవచ్చిన వాళ్ళకిచ్చి చేసుకొంటా-మీ రెవరు నన్నడగడానికి" అన్నాడు ధైర్యాన్ని కూడగట్టుకొంటూ.

గోవిందలాల్ మొహం, అతని మొహం మీద మచ్చకన్న వికృతంగా మారింది.

"అయితే! డబ్బు యిచ్చేయ్! ఊఁ! యివతల పారేయ్ డబ్బు! మేమిచ్చిన డబ్బు తీసుకురా?" కరుగ్గా, సూటిగా గర్జించాడు.

(సశేషము)

## శ్రీ సాయినిలయంలో గురు పౌర్ణమి ఆరాధన

మద్రాసు - షెణాయ్ నగరంలో ది 11-7-57న స్వామి కేశవయ్యజీ ఆషాఢ పౌర్ణమి సందర్భమున శ్రీ సాయినిలయంలో గురుపూజను వైభవోపేతముగా జరిపిరి. శ్రీ బాబా సన్నిధిన భగచ్చిత్ర పటములు పూలమాలలతో అత్యంతరమణీయముగా నలంకరింపబడెను. పూజాపుష్పాలతోటి, అలంకరణతోటి, ధూప, దీప, నైవేద్యాములతోటి కలియుగ వైకుంఠముగా నొప్పిన శ్రీ బాబా సన్నిధికి అరుదెంచిన అశేష భక్తకోటికి పూజానంతరము సాయంకాలము 5½ గం|| ల నుండి రాత్రి 12 గంటలదాక విభూది ప్రసాదములను, శ్రీసాయిబాబా తమ గురుపూజాసందర్భమున భక్తులకు కానుకలిచ్చినట్లు కొందరికి కానుకలను స్వామీజీ పంచిపెట్టిరి.

వేలకొలదిగా గుమిగూడిన భక్తులు పారవశ్యంతో శ్రీ సాయిబాబాకు ఫలపుష్పాదుల నర్పించి శ్రద్ధాభక్తులతో ఆరాధించి, కొందరు నివేదనకాగానే మధుభక్ష్యములను పంచిపెట్టిరి.

# దివ్యజీవితములో గురువుయొక్క పాత్ర

మూలం :

**స్వామి కేశవయ్యాజీ**

అనుసరణ :

**శ్రీ సి. సి. పున్నయ్య**

గురువును గురించి కాలానుగుణ్యంగా వారి వారి మనస్తత్వముల ననుసరించి చాలమంది అభిప్రాయపడు చుందురు. విద్యాబుద్ధులు చెప్పు ఉపాధ్యాయుని దగ్గరనుండి శ్రీ దక్షిణామూర్తివలె మహత్తరమైన, దివ్య పురుషుల వరకు భావనలో నున్నది.

ఒక కవి "ఆ మర్రిచెట్టుక్రింద ఒక యువ ఉపాధ్యాయుడు కూర్చొని యున్నాడు. అతని శిష్యులంతా వయసుమీరినవారు. ఆయన బోధన నిశ్శబ్దత; కాని అతని శిష్యుల సందేహాలన్ని తీరిపోతుంటవి" అని గురువును చిత్రించాడు.

గురువు అనగా దివ్య జీవనమువైపుకు పురోగమిస్తున్న యాత్రికుని జీవితముపై దివ్య ప్రకాశమును ప్రసరించు ధృవనక్షత్రములాంటివాడు. అతడు సరియైన మార్గదర్శకుడుగా నుండును. కొందరు ఆ మార్గమునకు దూరముగా నున్నారు - అది ప్రవృత్తి మార్గము. త్వరగానో, తర్వాతనో దివ్య ప్రకాశము వైపుకు తిరుగుట నివృత్తి మార్గముగా వర్ణించబడినది. అప్పుడు వారు అంధకారమునుండి వెలుతురువైపుకు నడచుచున్నారు; అది సరియైన మార్గము. గురువుయొక్క పాత్ర దివ్య జీవితముపట్ల ఆసక్తికలవారి పాదములను ఉత్తమోత్తమమైన, పవిత్రమార్గమున ముక్తిపథమువైపుకు పెట్టుట. ఆయన ఆసక్తితో, మార్గదర్శియై ప్రేమమూర్తియైన తల్లి తన పాపను చూచునట్లు కనిపెట్టియుండును.

## మూడు మార్గములు

ముక్తి సాధనకు చాల మార్గములున్నవి. వానిలో కొన్ని జ్ఞాన, కర్మ, భక్తి అభ్యాసములు. ఇది ప్రతి ఫలమునకు ఎదురుచూడకుండా చేయవలసినవి. చాల మంది ముక్తిపై ఆసక్తికలవారిని భక్తిమార్గము ఆకర్షించుచున్నది. ఈ మార్గములో సంపూర్ణమైన ఆత్మ నివేదన గురువుకుగాని, పరమాత్మకుగాని జరుగవలసి యున్నది. ఇదే ప్రేమమూర్తి, ప్రేమించినవారి ఐక్యత. దీనిని మనము భక్తురాలు మీరాబాయి, శ్రీ ఆండాళు జీవితములలో గమనించతగినది. తన దివ్య జ్ఞానముతోటి, తన బోధనలతోటి సద్గురువు జీవితములో భక్తి మార్గముయొక్క ప్రాధాన్యమును నిరూపించగలడు.

శ్రీ సాయిబాబా తరచుగా ఒక గురువు దగ్గర నుండి మరొకరి దగ్గరకు మారిపోవుచున్నవారినిచూచి చాల బాధపడెను. 'దొల్లుడుబండ ఊడ్పును సేకరించలేదు' అను సామెత సాధారణ విషయములలో వలె ఆధ్యాత్మిక విషయములలోకూడ సత్య సమ్మతము. ఒక భక్తునకు దివ్య పురుషుడుగా, పవిత్ర మూర్తిగా మరొక గురువు ఆకర్షించి తన స్వంత గురువును వదలివేసెను. కొన్ని నెలలకు మరల స్వంత గురువుకడకు కలతచెందిన మనస్సుతో వచ్చి చేరెను. అతడు సాధించిన మునుపటి మనశ్శాంతిని, ఆధ్యాత్మిక శక్తిని కోల్పోయెను. అప్పుడతడు గురుపట్ల విశ్వాసము ఒకే మార్గముగా నుండవలెనని గుర్తించెను. శ్రీరామకృష్ణ పరమహంస దానినే రూఢిపరచుచు "శిష్యుడు గురువు నెన్నడు విమర్శించరాదు. గురువుచెప్పినవానినెల్ల మన్నించవలెను. గురువు త్రాగుబోతుల, పాపుల యిండ్లకుపోయినా ఆయన పవిత్రుడుగానే భావించబడవలెను. అనగా గురువులోని లోపము లెన్నుటకాని, విమర్శించుట కాని శిష్యునిపనికాదు. అచంచలమైన భక్తి విశ్వాసములతో గురువును అనుసరించి, ఆజ్ఞలను మన్నించవలసియున్నది. ఈ విధంగా ఒక గురువు నెన్నుకొని దృఢవిశ్వాసంతో, సద్భక్తితో మనము ఆత్మనివేదనముచేయవలసియున్నది. దానికి ఓర్పు, ఆసక్తితో శ్రీ సాయిబాబా చెప్పినట్లు "మీరు యితర గురువుల విశిష్టత ఏమైనా, మీ గురువు లోపములేవైనా మీ యొక్క గురువునే దృఢవిశ్వాసంతో అనుసరించి అంటిపెట్టుకొని యుండండి! ఆయనతో సాన్నిహిత్యము నెన్నడు విడువక, మరింత దృఢంగా ఆయననే నమ్ముకోండి!"

## గురువు సహాయపడు విధము

గురువు బోధించుట, లేక యితరుల చెవులలో

నూదుట మాత్రముగాదు చేయునది. గురువుతో సాన్నిహిత్యము, ఆయన మహిమమూలముగా, భక్తి పూర్వకమైన ప్రేమ మూలంగాను గురువు అనుగ్రహమును సంపాదించగలము. గురువుయొక్క ఉనికి యే హృదయమును జలతరింపజేయును; ఆత్మను ఉన్నత స్థాయికి తెచ్చును. శ్రీ సాయిబాబా స్వానుభవమును వివరించుచు "పన్నెండు సంవత్సరములు నాగురువును విశ్వసించి అనుసరించాను. ఆయనకు నాపైగల అపారమైన ప్రేమను ఎట్లు వర్ణించగలము! నేను ఆయనను చూస్తూ కూర్చునేవాడిని—మేమిద్దరం దివ్యానందమును అనుభవించేవారము... నేను మరి దేనిని లక్ష్యంచేసేవాడినికాను...రాత్రింబగల్లు ఆకలి దప్పులు తెలియకుండా ఆయనను దృష్టిలో నుంచుకొని ప్రేమించేవాడిని.. గురువు ఒకక్షణం లేకపోయినా నేను కలత చెందేవాడిని. నేను గురువును తప్ప మరేమిధ్యానం చేసేవాడినికాను. కాదృక్కులు ఎల్లప్పుడు ఆయనపైనే కేంద్రీకరించబడియుండేవి. నాకు గురువుదగ్గరనుండి ఏమి అవసరముండేదికాదు. ఆయనకు నాప్రేమ తప్ప మరేమి కావలసియుండేదికాదు. సహజంగా ఆయన నన్ను నిర్లక్ష్యం చేయకుండా తనచూపుతో రక్షిస్తుండేవాడు. మా గురువు నా చెవులో మంత్రమేమి ఊదలేదు. ఆయన దయవలన యీనాడీస్థితికి వచ్చాను. గురుభక్తిని ప్రధానంగా కల ఉద్దేశ లక్ష్యాలతో సులభంగా ముక్తి పథమును సాధించవచ్చును. ఈ సత్యాన్నే మా గురువు నాకు నేర్పినది. ఆరు శాస్త్రముల నరయుటకు, నాలుగు సాధనలకు పూర్తిగా గురువును విశ్వసించుట చాలును."

## శ్రీ సాయిబాబా సలహా

శ్రీ సాయిబాబా ప్రవచనములు భక్తునియొక్క బుద్ధి వికాసమును, విజ్ఞతను తెలుపుచున్నవి. ఇలా శ్రీ బాబా, ప్రేమతోనిండిన హృదయంతో, నిశ్చలత్వముతోను, మౌనముతోకూడిన ధ్యానముతోను, ప్రేమచూడ్కులతోను తనలోని ఆత్మ, పరమాత్మల పవిత్రత నర్థముచేసికొనగల స్థాయికి రాగలిగెను. దివ్య జీవితము పట్ల ఆసక్తిగలవారి జీవితంలో సద్గురువు నిర్వహించగల పవిత్రపాత్ర యిది. దైవస్వరూపుడైన గురువు అనురాగ వాత్సల్యములు భక్తుని సర్వకాల సర్వావస్థలలో రక్షించుచుండును. శ్రీ సాయిబాబా "నాచూపు, ఎచ్చటనున్నా, ఏమి చేసినా ప్రేమించే వారిపై నుండును.........నన్ను తలచినప్పుడెల్ల, ధ్యానించినప్పుడెల్ల మీతో నేయుండుననునది మరచి పోకండి! నన్ను శరణువేడిన వారినందరికి ప్రక్కనే యుండి డాక్టరునగుదును. నాకు నివేదించకుండా భుజించనివానికి నేను వాని బానిసను. నేను భక్త పరాధీనుడను. నేను మీతో, మీలో, బయట, మీ చుట్టూ యుందును."

## విజ్ఞప్తి

శ్రీసాయి నిలయమునకు శ్రీ బాబా పూజారాధనలకు ప్రతి గురువారం వేలకు వేలమంది వచ్చి శ్రీ సాయిబాబా అనుగ్రహమును కోరునప్పుడు శ్రీ బాబా సందేశములో ప్రధానములైన ఓర్పు, సహనము, పవిత్రత, హృదయ నైర్మల్యములను పారజూచుకొనవలసి యున్నది. దర్శన ప్రసాదములకని ఎగబడటగాని, లేక తర్కవివాదములకు పూనుకొనుట కాని, రచ్చరాద్ధాంతములకు తలపడుట కాని అవాంఛనీయములు. పవిత్రమైన శ్రీ సాయి నిలయంచెంత శ్రద్ధాభక్తులతో క్రమశిక్షణను పాటిస్తూ, శ్రీ సాయిబాబా అనుగ్రహ కటాక్షములకు పాత్రులుకావలసి యున్నది. భక్తి విశ్వాసములు లేనివారు వేడుకకొరకనో, లేక మరే ఉద్దేశముతోనో అచ్చటికి వచ్చి గొడవపెట్టుట క్షేమకరముకాదు; వాంఛనీయము కాదు.

—:o:—




**నవభారత నిర్మాణంలో ఆచార్య రంగా : శ్రీ కె. వి. సుబ్బయ్య. వాహినీ ప్రచురణలు, విజయవాడ - 2. వెల 0-2-0.**

ఈ చిన్న పుస్తకంలో ఆచార్యరంగాయొక్క రాజకీయ నాయకత్వము నవభారత నిర్మాణమునకు ఏఏ రంగాలలో ఎట్లెట్లు వుపయోగపడింది వివరించడానికి గ్రంథకర్త ప్రయత్నించాడు.

**శంఖారావం (రంగాజీ జీవితగాథ): శ్రీ కే. సభా. వాహినీ ప్రచురణలు విజయవాడ - 2. వెల 0-4-0.**

ముఖ్యంగా క్విట్ ఇండియా ఉద్యమంనుండి బుర్ర కథలు జాతీయవీరుల సంస్మరించుటకు, జాతీయ భావములను ప్రబోధించుటకు ప్రచారంలో నున్నవి. ఆచార్యరంగా జీవిత చరిత్రను సయితం ప్రచారము చేయుటకని యీ రచన రూపొందింది.

గ్రంథకర్త ఆచార్యరంగాగారి అనుచరులు, ఆరాధకులు కాబట్టి రచన కడుసమర్థంగాను, రసవంతంగాను సాగింది.

**భక్తాంజలి : శ్రీ పాలపర్తి నరసింహము. ప్రకాశకులు: ఆంధ్రబ్రహ్మ సభ, రాజమహేంద్రవరము, తూర్పుగోదావరి జిల్లా, వెల రు. 0-75.**

మానవుని ఐహికాముష్మిక సుఖములకు, ముక్తిసాధనకు భక్తిమార్గము సులభసాధ్యమైనది. అనగా భక్తి విశ్వాసములతో ఆత్మను పరమాత్మ కర్పించి ఆత్మపరమాత్మల ఐక్యతను ఉద్దేశించుటయే భక్తిసాధన ఉద్దేశము. ఇందుకుగాను, నిస్వార్థంగా ధ్యాన, భగవన్నామ సంస్మరణ, పూజారాధనలు ఉద్దేశించబడినవి. ఇందులో దేనిని విశ్వాసముతో అనుసరించినను మానవుడు ముక్తిపథము నందుకొనగలడు.

రూపము ఏదైనా భగవంతుని నమ్మి చింతన చేయుట కనువుగాను, ఆత్మ పరమాత్మల నరగయలందులకు ఈ గ్రంథము తప్పక తోడ్పడగలదు. భక్తి, ముక్తి తత్వముల ప్రబోధమునకు యిది మహోపయుక్తమయినది.

**తులసి - గోపూజ : శ్రీ బులుసు సూర్యప్రకాశము. ప్రకాశకులు : సాధన గ్రంథ మండలి, తెనాలి. వెల రు. 0-12.**

సాధన గ్రంథ మండలివారు అనేక ఉపయుక్తమయిన గ్రంథములను ప్రచురించుచున్నారు. అందులో యిది యొకటి. హిందువులు పవిత్రముగా భావించి, ఆరాధించు తులసి, గోమాతల పూజారాధనల మహాత్మ్యమును వివరించుచు, పూజా విధానము యిందులో వివరించబడినది. ప్రతియొక్కరు పఠించి, పూజారాధనలలో యీ చిన్న పుస్తకమును వినియోగించనగును.

# సంపాదకీయములు

## యుద్ధప్రమాదం తప్పదు

"సామ్రాజ్యవాదము నశించనంతవరకు యుద్ధప్రమాదం తప్పదు" అని ప్రాగ్‌లో శ్రీ క్రుశ్చేవ్ ఉద్ఘాటించాడు. అది ఆయన అభిప్రాయంమాత్రముకాదు. ప్రపంచములోని ప్రతి పౌరుడు భావించునదియు నదియే. కాని సామ్రాజ్యవాదమున కంటిపెట్టుకొని అధికారవాంఛలతో అహంకారయుతంగా, అన్యాయంగా వ్యవహరిస్తున్న ఏరాజ్యమైనా ప్రపంచశాంతి అభ్యుదయాలను ప్రోత్సహించగలదనుకోడం ఆత్మవంచనకాగలదు.

సామ్రాజ్యవాదము నశించిన ప్రపంచములో ప్రతి పౌరుడు నిర్భయంగా, న్యాయధర్మచింతలతో తోటి ప్రజానీకంతో సమరసమైక్యతల వాతావరణములో జీవయాత్ర కవకాశముండును. అప్పుడు ప్రజలు ఎవరికివారు స్వీయసౌభాగ్యమును తీర్చిదిద్దుకొన ఆసక్తి చూపుదురేకాని యితరుల అవకాశములను, హక్కులను కొల్లగొట్టాలని, శాంతి సౌభాగ్యాలను నాశనంచేయాలని పూనుకొనరు.

## శాంతి ఉద్యమం

హింసావిద్వేషాలు ప్రపంచమును అల్లకల్లోలపరచు ననునది యదార్థము. అయితే స్పర్ధలు, విద్వేషాలు చెలరేగుతున్నంతకాలము శాంతి అభ్యుదయాలు సమకూరడంకల్ల.

సుస్థిరమైన శాంతి ఏర్పడాలంటే ప్రపంచ ప్రజల్లో మానసికపరివర్తన అవసరము. అధికార, ఆధిపత్య వాంఛలకు అంతం ఏర్పడి పరస్పర సద్భావ, సానుభూతి సహకారములతో ప్రజలు మెలగిననాడుకాని శాంతి ఏర్పడదు. పరస్పర విశ్వాసంతో, న్యాయంగా, ధర్మసమ్మతంగా యావత్ప్రజానీకం జీవయాత్ర సాగించే అవకాశమును, హక్కును దురుద్దేశాలతో ఎవరు ఎవరికి నిరాకరించినా అశాంతి అక్కడనే ఉత్పన్నము కాగలదు.

శాంతియుత పద్ధతులద్వారా వివాదాలను, ప్రపంచ సమస్యల పరిష్కారానికి ప్రయత్నించినచో శాంతి స్థాపన సంభవమేకాని మారణహోమంతోటి శాంతి భద్రతలు మెరుగుకానేరవు.

ప్రజావసరాలలో శాంతి అభ్యుదయాలు ప్రధానమైనవని గుర్తించిన ఏ రాజ్యముకాని అణ్వస్త్రాల యుద్ధానికి తాను తయారయి, యితర రాజ్యాలను ఆయత్తపరచవు.

## ప్రజాధనం వినియోగం

ప్రజాధనం వినియోగంలో ధర్మచింత అవసరమని ఇండియా వైస్ ప్రెసిడెంటు డాక్టరు రాధాకృష్ణన్ గారు ఉద్బోధించినదానిని ప్రభుత్వ అధికారులు, అనధికారులు గుర్తించినచో జాతీయ అభ్యుదయ పురోభివృద్ధులు మరింత సుగమం కాగలవు.

ప్రజాధనం వినియోగంలో ధర్మచింతకలిగి వ్యవహరించలేనివారు అట్టి గురుతర బాధ్యతలను స్వీకరించదముకాని, అట్టివారికి బాధ్యతల నొప్పజెప్పుటకాని తప్పిదమే కాగలదు.

# శ్రీ హేవళంబినామ సం॥ర ఆషాఢ, శ్రావణమాసములు

| | | |
|---|---|---|
| 1957 సం॥ జూలై 16 | మం | చవి 8.43 శత 19.39 కుజచతుర్థి, దక్షిణాయన పుణ్యకాలం |
| 17 | బు | పం 13.9 పూభా 25.37 |
| 18 | గు | ష 17.17 ఉభా 31.15 త్యాజ్యాభావః |
| 19 | శు | స 20.54 రే 36.20 |
| 20 | శ | అ 23.45 అశ్వ 40.36 శూన్యతిథిః |
| 21 | ఆ | న 25.36 భర 43.52 |
| 22 | సో | ద 26.20 కృ 46.1 |
| 23 | మం | ఏ 25.50 రో 46.55 |
| 24 | బు | ద్వా 24.5 మృ 46.34 |
| 25 | గు | త్ర 21.8 ఆర్ద్ర 45.3 తిథిద్వయం, మాసశివరాత్రి |
| 26 | శు | చతు 17.4 పున 42.27 |
| 27 | శ | ● అమా 12.4 పున 38.59 త్యా 3.46 |
| | | **శ్రావణమాసము** |
| 28 | ఆ | శుపా 6.18 ఆశ్లే 34.22 త్యా 3.44 |
| 29 | సో | విది 0.4 ఏవ్యం 53.24 మ 30.23 త్యా 3.40 స్వర్ణగౌరీవ్రతం |
| 30 | మం | చ 46.45 పూఫ 25.46 మంగళగౌరీవ్రతం |
| 31 | బు | ప 40.24 ఉఫ 21.19 త్యా 3.44 |
| 1957 సం॥ ఆగస్టు 1 | గు | ష 34.36 హ 17.18 |
| 2 | శు | స 29.33 చి 13.59 |
| 3 | శ | అ 25.27 స్వా 11.32 |
| 4 | ఆ | న 22.26 వి 10.9 తిథిద్వయం |
| 5 | సో | ద 20.38 అనూ 9.56 |
| 6 | మం | ఏ 20.4 జ్యే 10.56 |
| 7 | బు | ద్వా 20.44 మూ 13.10 |
| 8 | గు | త్ర 22.31 పూషా 16.30 త్యా 4.17 శూన్యతిథి |
| 9 | శు | చతు 25.19 ఉషా 20.47 వరలక్ష్మీవ్రతం |
| 10 | శ | ○ పౌ 28.54 శ్ర 25.56 జంధ్యాలపౌర్ణమి |
| 11 | ఆ | కృపా 33.3 ధ 31.36 త్యా 4.24 గాయత్రీజపం |
| 12 | సో | విది 37.32 శత 37.35 |
| 13 | మం | తృ 42.0 పూభా 43.35 త్యాజ్యాభావః |
| 14 | బు | చ 46.16 ఉభా 49.20 త్యా 4.24 |
| 15 | గు | పం 50.1 రే 54.36 స్వాతంత్ర్య దినోత్సవం |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
**Ag. Editor : C. C. Punniah.**




# 57 ఏళ్లగా ఖ్యాతి గాంచినది.

వనితకు ఏ వయస్సైనా లోధ్ర మంచి పుష్టి నిచ్చే టానిక్. ఆరోగ్యానికి. ఆనందానికి లోధ్రను మించిన టానిక్ లేదు. కెమిస్టు లందరి వద్ద దొరుకుతుంది.

లోధ్ర స్త్రీల దివ్యౌషధం






కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.
రాయపేట - మదరాసు - 14.

ఆంధ్ర ప్రదేశ్, ఒరిస్సాకు ఏజంట్లు :
శీతారాం జనరల్ స్టోర్సు, విజయవాడ & సికిందరాబాద్, బరంపురం

Lodhra Press, Madras- 14.